వేగుఁజుక్క గ్రంథమాల — 32 పండితప్రతి.

# సరసశృంగారము.

(లేక)

# హేమసుందరోపాఖ్యానము

(పూర్వకవిప్రణీతము)

**Scholar's Edition**

**(For Private Circulation Only.)**

బ్ర॥ శ్రీ॥ భాగవతుల నృసింహశర్మగారిచేఁ

పరిష్కృతము.

**Printed by :-COCANADA PRINTING WORKS,**
**COCANADA.**

*Published by:-* **Bh. N. Serma,**
*Proprietor* **Vegu jukka Series,**
*Pudipeddivari Street,*
**BERHAMPORE,** *(Ganjam)*

1st Edition
1000 COPIES.
1929



విలువ రూ 2-8-0] [ఖర్చులు ప్రత్యేకము

THIS CANCELS ALL PREVIOUS RULES.

*Estd in 1911.*


భాగవతుల నృసింహశర్మ,

ప్రొప్రైటర్,

వేగుఁజుక్క

గ్రంథమాల,

పూడిపెద్దివారి వీధి,

బరంపురం (గంజాం)


Registered.




1929.

# నిబంధనలు.

నిరూపకనవలలు, సాంఘికనవలలు, పుణ్యచరిత్రములు, మృదుమధుర ప్రబంధములు, మనోహరనాటకములు, మనోల్లాసకరములగు నితిహాసములు, చక్కని కాగితముతో, రమ్యమగు అచ్చుతో రెండు మాసముల కొక్కటిగా వెలువడును.

2 గ్రంథము వెలువడినవెంటనే చందాదారులకు ఒక్కొక్కగ్రంథము ఒక్కొక్క రూపాయికి వి. పి. చేయఁబడును. ఖర్చులు ప్రత్యేకము. ఇతరులకు ప్రతిగ్రంథము రూ 1—8—0 (ఖర్చులుగాక)

3. ఆరుగ్రంథములు (పోస్టేజీలుగాక) సంవత్సరమునకు ఆరురూపాయలు మాత్రమే. ఈయారురూపాయలు ముందు (ఎడ్వాన్సుగా) బంపు చందాదార్లకు రిజిష్టరుఖర్చులుండవు. ఎప్పటికప్పుడు 1 రూ॥ అడ్వాన్సుగా బంపినను ఖర్చులుండవు. ఇందువలన చందాదారులకు రూ 2—4—0 లాభముగలదు.

4. చందాదారులగువారు వెనుకటి గ్రంథములలో నేయొకగ్రంథమునైనఁ గోరిరేని ప్రవేశరుసుము 0-4-0 మాత్రమే. అట్లుకాక, తానుప్రవేశించిన పిమ్మటనుండి గ్రంథములఁ బంపగోరిరేని ప్రవేశరుసుము 0-8-0 మాత్రమే!

5. చందాదారులగువారు వెనుకటి గ్రంథములు పుచ్చుకొనవలెనను నిబంధన మెంతమాత్రమును లేదు. వారు కోరిరేని (కోరినగ్రంథములబట్టి) చౌకగా నిచ్చెదము.

6. అప్పుడప్పుడు వెలువడు అనుబంధగ్రంథములు శాశ్వతచందాదారులకుమాత్రమే యుచితము. ప్రతిగ్రంథముఁ దప్పకుండ స్వీకరించువారు శాశ్వతచందాదారులు.

# గ్రంథరచనా నియమములు.

1. Characterisation. 2 Developement of character, 3· New Ideas. 4. Historical Beauties, 5. Description of Nature and other varieties.

గమనింపుడు:—చందాదారులు ప్రతిగ్రంథముఁ బుచ్చుకొనుట తమకు విధియై యున్నది. తీర పంపించినపిమ్మట గ్రంథము నెంతమాత్రము ద్రిప్పి వేయరాదు. ప్రతి గ్రంథమునకు ముందు యింటిమేషను పంపుదుము. ఇష్టము లేనివారు వెంటనే మాకు దెలియఁ జేయవలెను. త్రిప్పివేయక ప్రతిగ్రంథము పుచ్చుకొను చందాదారులకుమాత్రమే అనుబంధ ముచితముగా పంపుదుము. అడ్వాన్సు పంపిన చందాదారులకు ఖర్చులుండవు. (రూ 2-4-0 లాభము.)

నూతనప్రచురణలు. (New Publications.)

## శ్రీతులసీరామాయణము.

నిర్వచనము—చిత్రపటశోభితము.

వాల్మీకిరామాయణమువలెనే హిందూదేశమునం దంతటఁ బ్రఖ్యాతిఁ గాంచిన రామాయణ మిది. మనభాష కిదియొక నూతనాలంకారము. ఇది హిందీభాషయందు శ్రీతులసీదాసమహాకవిచే వ్రాయబడినది. బ్ర॥ శ్రీ॥ భాగవతుల నృసింహశర్మగారిచే నాంధ్రీకరింపబడుచున్నది. జగద్గురువగు శ్రీగాంధీమహాత్మునిచే నిత్యముఁ బారాయణము జేయబడు నీరామాయణ

ప్రాశస్త్యముఁ జదివినవా రనేకవిధములఁ గొనియాడకపోరు. వివిధరసములకు, నుపాఖ్యానములకు, మనోహరగాథలకు నిది జన్మసీమ. ఒక్కొక్క కాండముఁజొప్పున వెలువడును. ఆంధ్రీకృతశ్రీతులసీరామాయణముఁ బొగడుచు మహనీయులు వ్రాసిన యుత్తరములు మునుముందు ప్రచురింపఁబడును. బాలకాండము వెలువడినది. ద్వితీయముద్రణములోనున్నది. అయోధ్యాకాండము రెండుభాగములు. ప్రతిసంపుటము చందాదారులకు రూ 1-0-0. ఇతరులకు రూ 1-8-0. పోస్టేజీ ప్రత్యేకము. బాల + అయోధ్యాకాండముల నిండు కేలికో బైండు సంపుటము రూ 3-0-0 ఖర్చులుప్రత్యేకము—అడ్వాన్సుపంపవలెను. అరణ్యకాండము విక్రయమునకు సిద్ధముగనున్నది.

## నవలలు

| | | | |
|---|---|---|---|
| 1 ఉగ్రభైరవము చిత్రపటశోభితము — చందాదారులకు | | | 1-0-0 |
| 2 సర్వమంగళ (నిండు కేలికో) | | ,, | 1-0-0 |
| 3 పద్మరాగము | 245 పుటలు | ,, | 1-^-0 |
| 4 చపల | 287 పుటలు | ,, | 1-^-0 |
| 5 విషమరహస్యములు | 226 పుటలు | ,, | 1-0-0 |
| 6 కాళీఘట్టురహస్యములు | 272 పుటలు | ,, | 1-0-0 |
| 7 ప్రణయసామ్రాజ్యము | | ,, | 1-0-0 |
| 8 ఉత్తమవంచకుఁడు (The Righteous Rogue) | | | 0-10-0 |
| 9 కాంతాపహరణము | | | 1-0-0 |

## నాటకత్రయము

## (భాగవతుల నృసింహశర్మ, గ్రంథకర్త)

| | |
|---|---|
| 1 విజయవిజయము-కర్ణార్జునుల యుద్ధము | 0-10-0 |
| 2 విచిత్ర వీరబొబ్బిలి (లేక) పద్మనాయకవిక్రమములు | 0-12-0 |
| 3 ప్రతిజ్ఞాచాణక్యము | 1-0-0 |

# మృదుమధుర పద్యగ్రంథములు

| | | |
|---|---|---|
| 1 | శృంగారసంధ్య గ్రంథకర్త భాగవతుల నృసింహశర్మ. | 1-0-0 |
| 2 | అభినవభర్తృహరి | 0-10-0 |
| 3 | కామాక్షీసరసము, గ్రంథకర్త మండా వేంకటేశశర్మ | 0-1-0 |
| 4 | గాంధిశతకము గ్రంథకర్త భా॥ నృసింహశర్మ | 0-4-0 |

☞ ఖర్చులు కొనువారే భరించుకొనవలెను.

చందాదారులకు, గ్రంథాలయములకు మాత్రమే.

(కొలఁదిదినముల పర్యంతమే.)

ఇందుగల నవలలు—నాటకములు—శతకములు—కోరినయెడల మిక్కిలి చౌకగానిచ్చెదము. ఈకన్సెషను కొలఁదికాలము పర్యంతమే. వలయువారు వేగముగ మాకు తెలియఁజేయవలెను. కొలఁదిప్రతులుమాత్రమే మిగిలియున్నవి. గమనింపవలెను.

వలయువారు:—భాగవతుల నృసింహశర్మ,

వేగుఁజుక్క-గ్రంథమాల, పూడిపెద్దివారివీధి,

బరంపురము, గంజాంజిల్లా అని వ్రాయవలెను.

గమనింపుడు:—మాచందాదారులు, తమకువచ్చినట్టి పార్సెల్సుపైని మా చిరునామా బాగుగ గమనించినపిమ్మట సొమ్ముచెల్లించి పుచ్చుకొనవలెను. మాపూర్వప్రచురణములలో, నేనే, వాఁడేవీఁడు, ప్రతులులేవు. అందు విక్రయమునకు సిద్ధముగానున్న గ్రంథములు 1 కాలూరాయి 2 కోటీశుశతన 3 విభ్రమరాఘవము. (జానకీపరిణయ వృత్తాంతము)

# ప్రధానపోషకులు.

1. M. R. Ry. I. V. Sivaramadass garu, Mokhasadar Narasingaraopuram.
2. ,, K. Krishna Rao garu, Land lord, Berhampore.
3. ,, K. Gurnadha Rao garu, Proprietor, I. L. P. Press, Berhampore.
4. ,, C. S. Natesam garu, Proprietor, Sree Krishna Mohana Samaj, Madras.

---

# రాబోవు గ్రంథములు.

1 భానుమతి:—అత్యద్భుతమైన నవల దరిదాపు 300 పుట లుండవచ్చును.

గ్రంథకర్త:—M. K. నాగప్పగారు B. A. బళ్ళారి.

2 "రెయినాల్":—నిరూపకనవల, హాంతకుఁ డత్యద్భుతసాహసి కార్యగణ్యుఁడు. తుదిముట్టు జరుపనిదే విడువరు.

గ్రంథకర్త:—K. V. గోపాలరావుగారు.

3 "పిశాచసందర్శనము":—ఇది నవలా ? నాటకమా ? దీనిఁగూర్చి యేమని వ్రాయవలెను. యథార్థములగు సంఘటనములు గలిగి, చదువుచున్న కొలంది నొడలు పులకరింపఁజేయు నంశములతో మెండుగ నిండుకొన్న యీ గ్రంథము నెల్లరుఁ జదివి యానందింపక పోరు.

గ్రంథకర్త:—S. V. రామమూర్తిగారు B. A. L. T.

# ప్రశంస.

1923 వ సం॥ మార్చినెల 23 వ తేదీని, ఆంధ్రపత్రికయందును, తత్పూర్వ మాంధ్రవాణియందును బ్ర॥ శ్రీ॥ పూడిపెద్ది వేంకటరమణయ్యగారిచేఁ బ్రకటింపఁబడిన హేమసుందరోపాఖ్యానోదంతముఁ బరికించి, * బ్ర॥ శ్రీ॥ శ్రీరంగము సోమేశ్వరశాస్త్రి B. A. గారిచే, సంపూర్ణముగ విమర్శింపఁబడిన యేతద్గ్రంథముఁ గూర్చి మే మధికముగ వ్రాయనవసరములేకయే, యాంధ్రులు సమగ్రముగ నెఱుంగఁగలరు.

ఈగ్రంథము ననుసరించియే నేను కామాక్షీనగవ మను చిన్నగ్రంథముఁ బ్రకటించితిని. నాఁటినుండియు నీగ్రంథముఁ బ్రకటింపవలెనని విశ్వప్రయత్నముఁ జేసిచేసి, పద్యగ్రంథములఁ బ్రకటించుటకు సాహసింపని, యీగ్రంథమాలవారిచే నెట్టకేలకుఁ బ్రకటింపఁజేసితిని.

బందరులో సాహిత్యపరిషత్సభ జరిగినప్పుడు నే నచ్చటికి వెడలియుంటిని. అచ్చటిపండితు లనేకు లీగ్రంథము నెట్లయినఁ బ్రకటింపవలెనని న న్నేకవిధముల నిర్బంధించి ప్రోత్సహించిరి. అందుచేఁ గష్టముపై నిప్పనికిఁ బూనొ్కని యిప్పటికీవిధముగఁ బ్రకటింపఁబడెను.

---

* ఆంధ్రపత్రిక:—రుధిరోద్గారిపుష్యశుద్ధ 18 శనివారము.
,, రక్తాక్షి జ్యేష్ఠబహుళ 12 శనివారము.
,, ,, ఆషాఢశుద్ధ 3 శనివారము.
,, రక్తాక్షి ,, 10 శనివారము.
,, ,, ,, బహుళ 8 శనివారము.
,, ,, మార్గశిర ,, 9 శనివారము.
మొదలగు సారస్వతానుబంధములలోఁ బ్రకటింపఁబడినది.

బ్రి॥ శ్రీ॥ శ్రీరంగము సోమేశ్వరశాస్త్రిగారు వ్రాసినట్లు గ్రంథాంతమునఁగల గద్యముఁబట్టిగాని, గ్రంథాదిఁగల పద్యములఁబట్టిగాని కవి కాలాదుల నిర్ణయించుట కవకాశము లేదు. గ్రంథాంతమునఁగల "మ॥ ధనకాంతాకుచమండలంబు నకుఁ జిత్తం బిచ్చి, విత్తంబు యా। వనమున్ బాసి......" ఈ పద్యముఁబట్టి కవి తన నామధేయము సూచించుట కిష్టపడ లేదని స్పష్టమగుచున్నది.

ఈగ్రంథము మూఁడాశ్వాసములుగలప్రబంధము. శ్రీరామాంకితము. ఈకవీశ్వరుని పద్యకవిత్వ మనవద్యముగ హృద్యముగనున్నది. సంస్కృతాంధ్రములఁ జక్కని పాండిత్యముగలవాఁడని యీగ్రంథము స్పష్టముఁజేయుచున్నది. బ్రి॥ శ్రీ॥ శ్రీరంగము సోమేశ్వరశాస్త్రి గారికిందియభిప్రాయముతో నే నేకీభవించుచున్నాను. "ఈతనికవిత్వము పదలాలిత్యము గలిగి మృదుమధురపదఘటితంబయి, సర్వలక్షణములకులోనై యున్నది. చేసినవర్ణనములన్నియు నూతనములై మనోరంజకములుగానున్నవి. ఇక్కవి పూర్వులుచెప్పినచొప్పుననే పదములుమార్చి చెప్పక నూతనాభిప్రాయములను జొన్పియున్నాఁడు. కవిత్వము గంగాప్రవాహమువలె నిరర్గళముగా ప్రవహించుచున్నది." కథ యాదృచ్ఛికముగాను, నీతిబోధకముగానున్నదనుటకు సందియము లేదు. ఈగ్రంథమునను గడుగునకు నీతిప్రబోధకములగు పదములున్నవి. మేము ప్రత్యేకముగ నిం దుదహరింపనవసరము లేదు.

ఈగ్రంథమున లోపించిన కొన్నికొన్ని పదములు, పాదములు, శ్రీమదాంధ్రతులసీరామాయణాది బహుగ్రంథకర్త

లగు బ్రీ॥ శ్రీ॥ భాగవతుల నృసింహ శర్మగారిచేఁ బూరింపఁబడినవి.

ఈగ్రంథ మొకానొక దుష్టవైద్యుని యసన్మార్గప్రవర్తనముఁగూర్చి వ్రాయఁబడినట్లు కన్పట్టుచున్నది. భోగవిలాసలాలసు లగుదుర్నీతిపరులకు, వైద్యవృత్తి, ధనార్జనమునకు సాధనముగానున్నదను విషయము నేఁటికిని మనకనుభవైకవేద్యముగా నేయున్నదిగదా? ఇట్టి కపటవైద్యుల నేమిచేసినను దప్పులేదు. ఈకవి, క్షేమేంద్రాదిసంస్కృతమహాకవుల యమూల్యశ్లోకరత్నంబుల, మిక్కిలి రసవంతముగ నాంధ్రీకరించి, తనగ్రంథమున జొన్పియున్నాడు. ఈభాగమంతయు, బ్ర॥ శ్రీ॥ శ్రీరంగము సోమేశ్వరశాస్త్రిగారు విపులముగ నాంధ్రపత్రికా సారస్వతానుబంధములయందుఁ జర్చించియున్నారు.

ఈగ్రంథమునఁగల కొన్నిపద్యములు నిరంకుశోపాఖ్యానము, తారాశశాంకవిజయములోని కొన్నికొన్ని పద్యముల పోలికలుగాఁ గన్పట్టుచున్నవి. ఆవిమర్శనాభారము పాఠకులకు వదలితిమి.

ఈగ్రంథము సాంతముగఁ బఠించిరేని, యీ మూలాగ్రముగ నెల్లవిషయములు గ్రహింపనగును. ఆంధ్రసోదరులు ప్రోత్సహించిరేని యిట్టి యుద్గ్రంథములఁ బ్రకటించి, యాంధ్రభాషాయోషాపదసేవకులమై, మన్ననలఁ బొందఁగలమని మనవిచేయుచు, నింతటితో విరమించుచున్నాను.

ఇట్లు భాషాసేవకుఁడు,

మండా వెంకటేశము,

గ్రంథసంపాదకుఁడు.

# సరసశృంగారము

రూ 3/1-



హేమసుందరోపాఖ్యానము.

శా. "ఆవేళన్ మనహేమసుందరుఁడు, కాంతామూర్తిఁ విలోకించి, యా
హావక్త్రాంబుజ మిట్టి సొంపుఁగలదే? యా కన్నులన్ జున్నులన్
గావా లతులుఁ గోటులుఁగా? మరుని భాగ్యం బబ్బెరా యంచు మో
హావేశంబునఁ గౌఁగిలించుకొనెఁ; భార్యం గూర్చి చింతించుచున్

శ్రీరామచంద్రాయనమః

శుభమస్తు — అవిఘ్నమస్తు.



# ప్రథమాశ్వాసము.



## —* ఇష్టదేవతాప్రార్థనము *—

మ. సరసీజాలయలక్ష్మియున్ భయపడన్ సంవర్తసాహస్రభా
స్కరతేజోమయనేత్రయుగ్మము సటాజాలంబుదీపింప వీ
రరసోద్రేకము చేభువిన్ గహకహారావంబునిండన్, భయం
కరకంఠీరవవక్త్రగహ్వరమునన్ గర్జించి భర్జించి ని [శ్రీ
ర్జరవైరిన్ వధియించియాంత్రమయహారస్ఫూర్తిజృంభించు
నరకంఠీరవమూర్తి, దైత్యకులకాంతారాగ్నివత్కీర్తి, సుం
దరునిస్తేజు నొనర్చుతన్ సితనిశాతక్రూరదంష్ట్రాఘృణిన్.

సీ. అతులగంభీరసుధాంభోధిసంభూత
కాలకూటానలకంధరుండు

ఆభోగిభోగసహస్రమణీఘృణీ
భూషితభుజగేంద్రభూషణుండు
ప్రళయకాలాభీలఫాలనేత్రోద్భూత
వహ్నిభస్మీభూతపంచశరుఁడు
కోపప్రతాపసంతాపితలోకహా
హాకారదనుజలోకాంతకుండు.

గీ. కాలకాలుండు, రుద్రుండు శూలధరుఁడు
పాపఖనియైన సుందరుభవనమునను
భూతబేతాళవితతి సమ్మోదమంద
జ్వలితఫాలనేత్రుం డయి మెలఁగుఁగాత.

సీ. శత్రువక్షశ్శైలజాతశోణితనదీ
కలితసంగ్రామరంగప్రతోళి
మండలాగ్రదళితమహిషరాక్షసమాంస
తృప్తాఖిలక్షుద్రదేవతాళి
శుంభనిశుంభరక్షోవీరభీకర
రుండమాలాంకితోరోజపాళి
గరుడామరోరగగంధర్వకిన్నర
వర్ణితకల్పకప్రసవధూళి

గీ. భయదవక్త్రగండూషితవరమధూళి
వైరిజనగాఢగర్వాంధకారహేళిఁ

కరతలాంచిత శుష్కకంకాళిఁ గాళిఁ
బ్రస్తుతింతు సుందరుని గర్వంబణఁప.

ఉ. క్రూరనిశాతవజ్రనఖకోటివిఖండితవైరిమస్తకాం
భోరుహభూషితుండు, పరిభూతసమస్తనిశాచరుండు భం
భారవరావకృద్విపులవక్త్రుఁడు విక్రమనిగ్రహోగ్రకం
ఠీరవుఁ డైన భైరవుఁడు ఢీకొని సుందరురూపుమాపుతన్.

ఉ. తాళుఁడు తాళుఁడం చరిపుదండములన్ విదళించు సద్భుజో
త్తాలుఁడు, దీర్ఘదేహజితతాలుఁడు పాదవిఘాతభీతపా
తాళుఁడు, వజ్రఖండసమదంతవిఖండితసాలుఁడైన బే
తాళుఁడు, హేమసుందరుని దర్పము శ్రీయు నణంగఁ జేయుతన్

చ. ధనికులమంచు నిక్కిలిమదంబున గ్రిందును మీఁదు గానకుం
డను గరువంబుతోడను జనంబుల బాధలఁ బెట్టుచుండు న
మ్మనుజులవక్త్రజాతపదమార్గణఘాతలచేతఁ గాలునిం
గనుఁగొనఁ జేయఁజాలు కవినాథులఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

వ. ఇట్లిష్టదేవతలఁ బ్రార్థించి, సుకవుల సన్నుతించి,

మ. పడపుంగొమ్మల యెమ్మెలన్ మఱియుఁ బైపై వన్నెలం జూచి లో
బడియారోగ్యము భాగ్యమున్ వ్యయముగా వర్తించువారా
త్మలో,నడలన్ సజ్జనులెల్ల మేలనను పాఖ్యానప్రబంధంబు నా
బడు గ్రంథంబు రచించువాఁడఁ గవితాప్రాగల్భ్యమేపారఁగన్

వ. అని నిశ్చయించి,

సీ. సజ్జనోద్యానవ సంతున కవనిజా
కాంతున కసురలో కాంతకునకు
వాహావక్రమునకు నతిపరాక్రమునకు
విక్రమునకు సింహ విక్రమునకు
శతవిభీషణునకు నకులసంగ్రామవి
భీషణునకు శత్రు శోషణునకు
శితహేతిధరునకు సతతసన్నుతలీల
కంధరునకు దాన కంధరునకు

గీ. శంకరునకు నాశ్రితభక్త కింకరునకు
శ్రీకరునకు భక్తాహిత భీకరునకుఁ
గృష్ణునకు ధరాభారస హిష్ణువునకు
విష్ణువునకు జిష్ణునకు రోచిష్ణువునకు.

వ. అంకితంబుగ నేవిరచింపంబూనిన మహాప్రబంధంబునకు
గథాప్రారంభం బెట్టిదనిన.



# కథాప్రారంభము.



చ. ధనతృణకాష్ఠసస్యభరితంబయి, కూపతటాకవాహినీ
వనములచేఁబవిత్రమయి పర్వతపఙ్క్తికినాలవాలమై
వినగవినఁగఁబూర్వమొకవీడురహించు, వచింపరాదు ప
త్తనమని, వెండియున్ జనపదంబనఁబోలదు రెంటమధ్యమై
తనరిసుఖాస్పదం బయిముదంబానగూర్చునుపౌరకోటికిన్.

ఉ. ఆపురిభూతలంబునఁ బరాంకుశనామమునం దనర్చు, భూ
మీపతియొక్కఁడాపురసమీపమునంగల కోటనుండు నే
లోపముఁజెం దకుండజనలోకముహాయిగనుండ నచ్చటన్
గాపురముండువార లరకాపురముం దలపెట్ట రెన్నడున్.

ఉ. పాడుచు నాడుచుండు సురభామలపాటల నాలకింపగన్
బోడలుసంచరించుటకుభూగగనంబులనాక్రమించు బల్
మేడలు లేకయుండినను మిద్దెలతోడ దిటంబులైనట్టి
గోడలతోడనొప్పు గృహకోటి విరాజిలు నప్పురంబునన్.

ఉ. కొండలుచుట్టుఁబట్టు నెలకొన్న కతంబున నెండకాలమం
దుండఁగరాదు, వేండ్రమునకోపరు పౌరులు శీతకాలమం
దుండఁదరంబుగాదు చలియున్ జలపట్టును వానకాలమె
ట్లుండునొ చెప్పరాదచటనొక్క వసంతము జెప్పనొప్పగున్.

ఉ. యోగులురాగులున్ధనవియోగులుభోగులువిప్రయోగులు
ద్యోగులు,రోగులున్నపనియోగులుగానినియోగులున్ధన

త్యాగులు, సంగహీనులగు । యాచకబృందముఁ బ్రోవఁగన్న
హా, భాగులు వీధివీధిఁ గను । పట్టుదు రెల్లెడఁ దత్పురంబునన్.

ఉ. కానలకైన నూకోని మొ । గంబునఁ బూతమేలుంగులూనిన
న్మానులనైన గోఁబలిమ । మాటల నేరుపుఁ జూచి సంకట
గ్లానులఁ జేయు చంద్రముఖు । లాంద్రకుమారుఁడుపన్ని నట్టిమో
ల్బొనులు గాని సానుల న । బోలదు తత్పురివారకాంతలన్.

ఉ. చోరులు, జారులున్ ఖలులు । సూరులు సజ్జనులైన వారలున్
ధీరులు నెవ్వరెవ్వరొ మ । దిన్ గ్రహియింపఁగరాదు వెండియున్
జారిణులన్ బతివ్రతల । సానుల భర్తలతోడనుండుసం
సారిణులన్ గ్రహింపఁదర । మాయలబ్రహ్మకునైనఁ దత్పురిన్.

ఉ. తొమ్మపతులంచు, జాతియును । ఖ్యాతియునీతియు లేనిహీనుఁడు
న్గోపియుదుష్టుఁడున్ ఖలుల । కొంగుపసిండియునైనవిక్రము
డాపురినెల్ల వేళలన । హాంకృతి నేలుచునున్నయట్టులా
టోపముఁ జూపుచుండు ను[illegible]దుండని యెల్లరు నీసడింపఁగన్.

ఉ. ఇమ్మగఁ బూర్వభూపరు ల । హీనబలంబున నేలియుంటన
త్యమ్ముగ నప్పురంబు గిఁబ । రాంకుశమయ్యెను నేఁడు వారివం
శమ్ము నశించి యన్యులవ । శంబుననుండుట, నేతిబీరసా [మై
మ్యమ్ము నవ్యర్థమయ్యెను ప । రాంకుశ నామము నామమాత్రె.

సీ. మోక్షమార్గముఁ దెల్పి । శిక్షించుబ్రహ్మవి
ద్యాభ్యాసులైన బ్రాహ్మణులుగలరు

శత్రులసాధించి శాసింపలేకున్న
నయమార్గచరులు క్షత్రియులుగలరు
ధనమునార్జించియు ధర్మంబుఁ దప్పని
యోగ్యులైనట్టి వైశ్యులునుఁగలరు
బ్రాహ్మణులంజూచి సద్భక్తితోడఁ జే
తులను జోడించు శూద్రులునుగలరు.

గీ. వారుపేరని వేర్వేఱ బలుకనేల?
అఖిలజాతులవారికి నాటపట్టు
సకలసుగుణావగుణముల జన్మగృహము
నై, తనర్చుఁ బరాంకుశం బనుపురంబు.

వ. మఱియు.

గీ. దుర్జనోపార్జితాస్తోక మర్యశంబు
విషయలంపటప్రాప్త కల్మషభృశంబు
సకలజనవిగర్హితజార జారిణీవి
రంకుశం బనిశంబుఁ బరాంకుశంబు.

ఉ. వరభూమీశులచేతనప్పురముమున్ బ్రఖ్యాతి బెంపొందియు
స్పరభూపాలురకున్ వశంబగుటనో? పైదేశవాసుల్ నిరం
తరమచ్చోటవసించుహేతువుననో తద్రాజవంశీయులం గ్రిన్
దఱుక్షీణింపఁబరాంకుశాహ్వయమువ్యర్థంబయ్యె నానాటి

సీ. సాహిత్యసాహిత్య సరణిసంభాషించి
వాగ్దేవిచేమెప్పు వడయఁజాలి

కృత్రిమప్రక్రియా శత్రు నోడించి, వి
శ్వామిత్రునుతిఁ గాంచు ప్రతిభ గలిగి
సతతంబు మిత్రుల సంతసింపఁగఁ జేసి
కమలమిత్రుని కంటె ఘనత కెక్కి
బంధకవిత్వప్రబంధంబులను వ్రాసి
సత్కవిప్రఖ్యాతి సంగ్రహించి

గీ. వైష్ణవాచారసంపత్తి బ్రాహ్మణప్ర
వృత్తిఁ గలిగినవారని ప్రణుతిఁ గాంచి
శిష్టులని చెప్ప నొప్పు గుణ శీలమునను
వఱలుచుండుదు రొకజాతి వార లచట.

గీ. చెలఁగి సృష్టికిఁ బ్రతిసృష్టిఁ జేయఁజాలు
నక్కులంబున దుష్టాత్ముఁ డక్కటకట
హేమసుందరాఖ్యుఁడు జనియించె నొకఁడు
తులసివనమునఁ గంజాయి వెలసినట్లు.

సీ. అతినీచభోగినీ సతతసంభోగదు
ష్కార్యసంభూతభ గంధరుండు
కాకఘూకానేక ఖంజరీటసమాన
ఘనదుర్యశోవ్యాప్త కందరుండు
నిఖిలభూజనబృంద నిందితాస్పందిత
కపటహాలాహల కంధరుండు

ఖరదూషణాది రాక్షసతుల్యదుర్గుణ
క్షోభితసకలవసుంధరుండు

గీ. సాధుసత్కవీశ్వరసద్యశఃపయోధి
మథనదుర్గుణధూర్వహమందరుండు
భయదమేహావహిణసమూహానయసజితపు
రందరుం డగు నాహేమసుందరుండు.

ఉ. నీతియుజాతి లేని యవినీతిపరుం డని జెప్పవచ్చుఁ; బ్ర
ఖ్యాతిగణింపఁగాఁదలఁచి "యాడితుఁదప్పినవాఁడ నేనియో
జాతికిఁ బుట్టలే దిదినిజం" బనిదబ్బఱలాడునాతఁ డే
జాతికిఁబుట్టెనో యెఱుఁగశక్యముగాదని యందు రెల్లరున్.

వ. అతండు వంచనాపరుండయి, ధనమార్జించువాఁడగుట,

శా. నానాశాస్త్రపురాణనామములనైనన్ బల్కునో రాడ ద
జ్ఞానంబత్యధికంబు, లేదనుభవజ్ఞానంబు, బాల్యంబునం
దోనామాలుపఠించియుండుననిలోనూహింపగావచ్చు; వి
ద్యాన్యై పుణ్యముఁగల్గినట్లుపలుకున్ దంభంబులప్రాంతమున్

మ. వలపొక్కింతయు లేకయున్నఁగకట వ్యాపారపారీణతన్
వల పున్నట్లు నటించి, పల్లవులయైశ్వర్యంబుఁ గొల్లాడురో
పొలఁతుల్దేవతలంచు సంతతము వ్యామోహంబునన్వారియా
త్మలనైక్యంబగు హేమసుందరుఁడు సామాన్యుండుగాకన్యుఁడే.

మ. కలలోనైన ననున్నఁ జూడఁడని శోకవ్యాకులస్వాంతయా
కులకాంతం గనిమీఁదుమిక్కిలి కడున్ గోపించు దండించు న
వ్వాలయన్ వేశ్యలఁ జూచి లోనలరు నోహోయంచు నింతేటి
కిం దలఁదాఁ గట్టుఁగఁ బెట్టియైన వెలకాంతం జేయు దేవేరిగా.

క. తలిదండ్రులు దూషించిన
జెలికాండ్రును జట్టములు హసించిన మఱియున్
దలపోయిన మొలపోయిన
వెలకాంతలఁ బాయఁ డిట్టి వేశ్యల నైనన్.

చ. కులసతిసొంపుఁ బెంపు నొకకోటికి హెచ్చినఁ గన్నులెత్తి డ
గ్గలమగు ప్రేమరో వేలఁదిఁ గాంచినఁ జాలును దానియందము
న్గలపక బానిసీఁడగును తానుమునింగిన యేఱుగంగ తా
వలచిన కాంత రంభ యను వాక్యము సార్థకమయ్యె వానికిన్.

శా. శీలంబుం గులమున్ యశంబు మదిలోఁ జింతింపఁడా వ్వేళ వే
శ్యాలోలుండయియుండు నన్న నదియాశ్చర్యంబుఁగా దోచదే
లోలంజూచినఁ జాలుఁ గామవశుడై లోచూపు గోల్పోవు నిం
కేలా వానిస్వభావముం దెలుపగా హీనుం డనం జాలదే.

క. ఆయూర గోపియనియెడు
ప్రోయాలోర్తుక వసించు మును తనమగనిన్
బాయని కులసతియయ్యుఁ
మాయావినియయ్యెఁ దుదకు మగనిం బాసెన్.

సీ. మగవాఁడువిడనాఁడె । మగువకుదిక్కేమి
యనిప్రజల్ చింతింప । నణఁగిమణఁగి
తలవాకి లిల్లుగాఁ । దలపోయుసతతంబు
నదియేమొ యనికొంద । ఱనఁజరించి
యట్టిపోఁకలఁబోవు । నతివగాదనికొంద
ఱనునట్టు లనుమాన । మొనరమెలఁగి
ప్రియులకోర్కెలఁదీర్చు । వేల్పుటావనివిట
సంతతిమోదింప । సంచరించి
'మబ్బుఁబాసినయొండ । మగనిరోసినముండ'
యనిజనుల్ దూషింప । నారితేరి

గీ. మేడలన్ దాఁగి వాడలన్ । గూడి యాడి
గోడలన్ దాఁటి సందుల । గొందు లందు
దిట్టయై ఱాఁగయై అవ । ఱట్టుదెచ్చి
తుదకుఁ దెరఁదీసె విటులసం । పదలుమానె.

గీ. తుదకు సందేహయవనిక । దొలఁగఁద్రోచి
మట్టుమీఱిన యాలంజె । గుట్టుమట్టు
బట్టబయలైనయంతనే । కట్టునడలి
బట్టబయలయ్యె విటులకుఁ । బట్టపగలు.

కం. ప్రజలెల్లను దూషింపఁగఁ
గుజనంబులఁగూడి యగ్ర । కులదూషితమై

నిజజాతిచ్యుతయై యు
గ్గజగామిని తుట్టతుదకు । గణికలఁ జేరెన్.

గీ. జారుఁ డొకఁడైనఁ జేరని । కారణమునఁ
బ్రియ మింతికుఁ దనకుఁ గై । వ్రాలుకతన
సొత్తుగుత్తగఁ దనకిచ్చు । సుందరునకు
మెచ్చు లిచ్చువాతరితీపు । మెచ్చులాడి.

సీ. ఇల్లుగుల్లగఁ జేసి । యిల్లాలిఁ బడఁ దన్ని
యామె సొమ్ములనెల్ల । నటుమటంచి
ఒకనాఁడు మంచంబు । నొకనాఁడుకంచంబు
నక్రమంబుగఁ దెచ్చి । విక్రయించి
సోదరు నిల్లాలి । సొత్తును వలఁ వల
మెల్లమెల్లగ నెల్ల । గొల్లలాడి
ఉన్నవారని తన్నుఁ । గన్నవారని వచ్చు
చెల్లెలి మఁల్లి యుఁ । బొల్లు చేసి

గీ. ఆలిబెగడొందఁ దండ్రియు । నాత్మగుంద
జుట్టములు దిట్టమఱఁదులు । ఱట్టుబెట్ట
"సిగ్గులేనట్టి దొంగ ఛీ-ఛీ" యనంగఁ
బ్రవరుండయిగోపి కా । పాపియిచ్చు.

ఆ. వె. ఎట్టిచోరునైన । నెట్టిజారునినైన
వానిఁ జెప్పి చెప్పు । వలయుఁ బిదపఁ

దాఁడినన్ను వాని । దలఁచున్న వాఁ డుండు
ననెడున్యాయ మతని । యందుఁగలదు.

చ. అలయుక పెద్దలెల్లఱుఁగు । లాంగనకుండుచునుండ వేశ్యలన్
గలయుట ప్రాణహాని యని । కన్‌విని వాఁడు "విరక్తిఁ జెందికా
నల మునినై తపింతు" నని । నవ్వుచుఁ బల్కుచు వెళ్లెదీరె రో
కలిఁదలఁ జుట్టుమన్న టులు । గా; నవివేకికిఁ జెప్పవచ్చునే.

సీ. త్రైవిద్యులైనట్టి । బ్రాహ్మణవర్యుల
వైదికజడు లంచుఁ । బలువరించుఁ
బాండిత్య మేపార । భాషించుపెద్దల
వదరుఁబోతు లటంచు । వాదు పెంచు
ముక్తిఁ గాంక్షించు వి । రక్తులభక్తుల
వంచనాపరు లంచుఁ । బంతగించు
తీర్థయాత్రలఁ జేయు । నర్థించు నర్థుల
వ్యర్థజీవులటంచు । నపహసించు

గీ. నఖిలముం బాసి సన్న్యాసు । లైన ఘనుల
నార! దొరకోలు సన్న్యాసు । లంచు నెంచు
గోపివల పింతచేసె వా । పాపినహహ
మందు నేమందుఁ దలపలే । దెందు మందు.

వ. ఇట్టి యాదుష్టాత్మునకుఁ జేదోడువాదోడుగ,

ఉ. కీవివహించి, సాము గరి । డీకసరత్తుల నారితేఁ, మైఁ
జేవఁగలట్టి వాఁడనఁ బ్ర । సిద్ధి రహించి పెనంగవచ్చుపై

లావరులఁ జయించి, జయ।లక్ష్మియుఁ గ్ష్మియుఁ దన్వరింప వే
శ్యావనధూర్వహుండనఁగ।నప్పరి రెడ్డి యొకండు రాజిలున్.

గీ. రోసము విలాసముం గల।మీసములను
సాముచే నాము మీరిన।మోము గలిగి
కాను కలిమి హరించిన।మేను దనర
బెబ్బులిం బోలి యాతఁడు।భీతిఁ గొలుపు.

ఉ. రెడ్డికులంబునం దవత।రించిన హీనకులీనుఁ డయ్యు రా
బిడ్డను బోలఁ దీవి, భుజ।వీర్యమునన్ గడిమీఱు బంటు నా
గడ్డుదనంబుఁ గాంతల నె।గాదిగఁ జూచు గుణంబుఁ గల్గి, యే
యడ్డును లేక వాఁడు తిరు।గాడుచుఁ బాడుచునుండు నెప్పుడున్.

గీ. మగల నెడఁ బాసి వాడల।దగవులాడు
వాడవదినెల వలపించు।వలపుకాఁడు
విటుల గృహములఁ గొల్లాడు।వేశ్యలకును
అచ్చుపొడిచిన యాఁబోతు।మచ్చుతండు.

సీ. బలవంతుఁ డను భీతి।వారకాంతలు వాని
ప్రాపుఁ గోరుచునుందు।రీ బావ యనుచు
ధనవంతుఁ డను నాస।జనులు కొందఱు వాని
భావించుచుందురు।ప్రభు వటంచు
నేపోరు లేకుండఁ।గాపాడునని వాని
నాదరింతురు కొంద।ఱన్న యనుచు

మల్లయుద్ధము నేర్పు మంచిమల్లని వానిఁ
గొందఱు సేవింతు రుగురు వటంచు

గీ. వానితో నున్న నేసాని యైనవలచు
ననుచుఁ గొందఱు ధనహీను లనుగమింతు
రేని గొలువని విటకాఁడు గానరాఁడు
విటుల కెల్లరకున్ రెడ్డి వేల్పుగిడ్డి.

ఉ. చానల మేలుబంతులగు జాణలతోడ్వరమించి విత్తముల్
మానములన్ హరించు మతిమంతుఁ డితం డనుఖ్యాతి యుండగా
సానుల నెందఱెందఱిని చక్కని చుక్కలఁ గూడి యొక్క కా
సైన నొసంగియుండఁడని యందురు తత్పురినుండు దుర్విటుల్.

గీ. ఈఁగకుం గాటు పామున కెపుడు బలియు
నొసఁగఁ డనునట్టిమాట యట్లుండనిండు
చిట్టచివరకు నెంగిలి చేతనైనఁ
గాకి నేయనివాఁ డని లోకు లందురు.

గీ. అట్టివాఁడయ్యు నా రెడ్డి యప్పుడపుడు
హేమసుందరునకు మాత్ర మిచ్చుచుండుఁ
దన్నువిడనాడ కేవేళఁ దప్పకుండ
మెచ్చు లిచ్చిన చిరకాలమిత్రుఁ డగుట.

వ. ధనవంతుండగు నీరెడ్డిని సందర్శింపఁదలంచి, హేమసుంద
రుండు విచారగ్రస్తుండై యొకనాఁ డేకాంతంబున గూర్చుం
డి కర్తవ్యం బేమియుఁ బాలుపోక యిట్లు దుఃఖించుచుండె,

గీ. తల్లిగతియించె, ముదిమదిఁ దప్పెఁ దండ్రి
పచ్చపూసైన లేదు నిష్పచ్చరంబు
వలపుఁ బెంపున నాగోపి బాయరాదు
వసుధ నీలీల కూళనై బ్రదుకరాదు.

సీ. గోపిసంతాపించి కోపించునేమొకో?
దినవెచ్చ మేరీతిఁ దీర్పవచ్చుఁ
దండ్రియొంతయులోన వేండ్రమొందుచునుండు
నాతని నేరీతి నరయవలయుఁ
దమ్ముండు మఱఁదలు దపియించుచుందురు
వారికిం దేరీతిఁ బాపవచ్చు
గట్టఁబట్టయు లేక బిట్టల్కతోనున్న
కులకాంత కేరీతిఁ దెలుపవచ్చు

గీ. నాథ! యిల్లమ్మఁబోయిన నడవియయ్యెఁ
గోరి కానఁబోవువారికిఁ గొఱవియయ్యె
వాడలంగలకొండంత పలుకుఁబడియుఁ
గోలుపోతి నీరీతి నేఁ బేలనైతి.

గీ. వలచివలపించి కలయిక నలరఁజేసి
చాల నాజాలమునకు సైపఁ జాల దార
కలికిగాదది మరునిపూములికిగాని
గోపి గాదది పీయూషవాపిగాని.

గీ. హెచ్చుగ ధనం బొసంగక । యిచ్చకములఁ
బలికినంతనె ననుమెచ్చి । వలపుగొనునె?
మెచ్చులాడి వలపుధన । మిచ్చుదాక
పచ్చపైకంబు గుల్లంబు । చచ్చుదాక.

ఉ. అన్నలినాయతాక్షి ప్రియుం బొనగూర్చెదనంచు నాత్మలో
నెన్నిన లాభమేమి? ధన । మొల్లఁడె వీఁడు? విరక్తిఁ జెంది రా
మున్నదిరాకమానదన । యూరకయుండిన, నాఁడు మీఁదఁగా
నున్నది కాకమాన దని । యుక్తి దలపోసి సహింపగావలెన్.

గీ. కలిమి లేకున్న లంజెతోఁ । జెలిమి యేటి
కనుచుఁ గొందఱు వచియింతు । రల్పమతులు
చెఱకుపండైన వలపుఁ దా । రెఱుఁగఁగలరె?
బిడ్డకు ప్రేమెఱుంగును । గొడ్డురాలు.

వ. ఇట్లు తం డపరిమితచింతాభరంబున డోలాయమానమానసుండై,

ఉ. ఆవగలాడి నన్నుఁ క । గృహంబును జేరఁగనీకు వీసమున్
నావలనన్ లభింప దను । నమ్మకఁ గల్గి యనాదరించు, నే
నేవగనైన విత్తము గ్రహించి యొసంగెదనంచు నాసుతోఁ
గ్రోవివలెన్నడంబడుచుఁ । గ్రుమ్మరుఁ జిక్కుఁడు గుడ్డికవ్వమున్.

ఉ. వారిజపత్రనేత్రఁ దన । భార్యను జూచి యనేకభంగులన్
గూరిమిఁ బెంచినట్టి జన । కుం గని చీఁకటి తప్పుచెయ్యులన్

జారులఁజూఱకొన్న నెర। జాణను గోపిఁదలంచి మువ్వురం
గూరిచె ముండదైవమని। కుందునతండువివేకశూన్యుఁడై.

చ. మదవతియైనగోపి కస। మానముగా ధనమీయకుండినన్
వదరుచు నింటికేగుఁడని। పల్కు-నిజంబనియాతఁడెంతయు
న్మదిఁదలపోయువేళఁగుల। మానినిపిల్చినఁజాలునుగ్రుఁడౌ
బెదవులచేటుగాక విరు। పేదలకోపము లాభహేతువే.

క. అలరులనమ్మిన స్థలమునఁ
గలకల పురమెల్లనవ్వ। గట్టెలనమ్మన్
వలసెఁగదా యని కుందున్
కులసతివీక్షించెనేని। కొట్టంబోవున్.

క. వలవల యేడ్చుం దడఁబడి
విలవిలమనిగింజుకొనుచు। వెంగలివరుసన్
బలుకులఁ బలుకును తుదకున్
గులజులలోదాని బ్రదుకు। గొడ్డే అయ్యెన్.

వ. ఇట్లనేకవిధంబుల దుఃఖించి సూర్యుం డస్తమించుటయు నెఱింగి,

సీ. ప్రేమించియొసఁగడే। రెడ్డిఁజూచెదనంచు
గుమ్మమ్ముదిగినంతఁ। దుమ్మనొకఁడు
ఆకీడుఁదొలఁగింప। వాకిటఁదఱివేఁచి
వడిఁబోవ నెదురయ్యె। బాలవిధవ

ఇదియేమియని లోని । కేగివచ్చినయంతఁ
గన్నులంబడెఁ దల । ఘాతకుండు
తులసినిదర్శించి । యెలమివచ్చుచునుండ
బలుకరించెను విప్ర । వరుఁ డొకండు

గీ. కూళ క్రేరితిసరిపడు । వేళయనుచు
గోపిదరిఁజేరఁజాలఁ డీ । పాపియనుచు
నదను సరియైనఁగార్య మా । ననుచు నెంచి
యొండుఁదలఁపక యింటఁ బ । రుండె నతడు.

వ. అట్లతం డింటఁ బరుండుటంజూచి, పృథుల వేదనాభరంబు
న ననేకదినంబులనుండి దుఃఖించి మోహయైయున్న కుల
సతి యించుక సంతసించి, నేఁటికి మతిమంతుఁ డయ్యెనో
యని యడియాస వహించి, వదినెను విలోకించి, యిట్ల
నియె.

ఉ. వదినె! యెఱుంగవే యొశుభ । వార్త? గృహంబుననిట్టివేళలన్
గదినిబరుండజూడ మొక । నాఁడయినన్ భవదీయసోదరుం
డదవదఁజెందెనే మొ? వల । పాఱశిపోవ మెలంగెనే మొకో
ముదిత? ధనవ్యయంబునకుఁ । బొక్కెనొ లేక వివేకమెక్కెనో?
ఆనలణంగనాదుకన । కాభరణంబుల వెచ్చఁబెట్టినన్
బాసి ధనాంగనన్ వలచి । పాడతికుత్తుకబంటియప్పులన్
జేసె, యశంబురోసె, సిరి । చిందులుద్రొక్కినయింటఁగాసులో
పీసము లేదు, చెప్పుటకుఁ । బెద్దలు లేరు; వివేకముండునే

ఉ. అత్తగతించె గాక, మగ | వాలు పతివ్రత సద్గుణాఢ్యరా
లిత్తఱి నామె యుండిన స | హించునె? యింతటి ఘోరమున్నె? రో
తొత్తులగుత్తకుంచుకొని | దుర్జనుఁడైన కుమారు బాయునే?
చిత్తము నచ్చఁజెప్పి, చెడు | నీతలనుండి మరల్పకుండునే?

సీ. మామగారప్పుడీ | మార్గంబు తప్పని
చెప్పిన నీ ముప్పు | తప్పకున్నె?
పినతండ్రియైన రో | వెలఁదుక కలయిక
ధనహాని యనినఁ దా | వినకయున్నె?
మఱఁదియు నీరీతి | మర్యాదగాదని
నొక్కి చెప్పిన నింత | పొక్కియున్నె?
వదినెరో నీవైన | వాదించి క్రమరీతి
బోధించియున్న నీ | బాధయున్నె?

గీ. ధనకనకవస్తువస్త్రసం | తతు లణంగెఁ
జెప్పఁ దలనొప్పి, యప్పులు | కుప్పలయ్యె
నంత యింతయ్యె, నింతకు | వంత హెచ్చె
నెందు కీకుందు చాలు నిం | కెవతెఁ బొందు?

ఉ. ఆయమెఱుంగకుండఁగవ్య | యంబొనరించుటయట్టులుం
దుర్జ్ఞేయపథప్రవర్తియయి | శీలము నాశముఁజేసె నక్క
వేయి వచింపనేటి కిఁక | విత్తమొసంగక యున్న గోపిరా
నీయదు; నీవెఱుంగ విది | యేచుమి కారణమింటనుంటకు

ఉ. కంటసమేటి కావలపుకానికిఁ దొత్తులు భార్యలైరి, నా
యంటుసహింపఁడించుకయునంటినస్నానముసేయునేమొ? యే
గంటునెఱుంగ, నింక కసుగందని నాసొగసేల? చాలుఁ బా
డింటికి దీపమేల? త్యజియించెదఁ బ్రాణము లేల చెప్పుమా.

క. అకళంకమైన సతినో
వికటాత్ముల విటులఁగూడు వెలవెలఁదినో యే
లుకొని సుఖించిన మేలగు;
నొకయొరలో రెండుకత్తులుండునె చెపుమా.

క. ఘనసారమిళితనవచందన
మున్ మైనలఁది గోపిదరిఁ జేయును నన్
గనునో చెప్పిన వినునో
కనకాంగీ! ముద్దుపుండు కాకికి ముద్దా.

క. ననుజేరి కష్టసుఖముల
వినునో? కొనియాడునో? ననుఁ బ్రేముడిఁ గనునో?
తనకలిమి యింద్రభోగము
తనలేమియె స్వర్గలోక దారిద్ర్యంబున్.

క. ఆడికపడ నా కేటికిఁ
బాడి వచించుటకుఁ బెద్దవారలు లేరో
దూడయు బఱ్ఱెయు నుండగ
నాడంబరమునకు గుంజ యఱచిన కరణిన్.

వ. అని యిట్లు విలపించిన యవ్వనితామణిం జూచి యావదినె యిట్లనియె.

శా. నీలోఁ జేవరవంతయైనఁ గలదేని నీభర్తయీలీల వే[యో
శ్యాలోలుండయియుండునే? యకటసంసారంబుపాడౌనె?
బాలా నీతులనెవ్వ రెన్నిగతులన్ వాక్రుచ్చినన్ లేదుసు
మ్మీలాభంబిసుమంతయైన; వినుమా మేలొందుమాజాణవై.

కం. నమ్మింపుము నీవలపున
నమ్మింపకు మింకకొంప; నతిచతురతతోఁ
దిమ్మిని బ్రహ్మిని, బ్రహ్మిని
తిమ్మినిఁ గావించునేర్పు తెలియుముగోలా.

కం. మెల్లగ భూతినయనంబుల
నల్లమురంజిల్లఁ జేయ నోపవె? బేలా
విల్లమ్ములు గలవారికిఁ
జల్లకడవలుగలవారి సాయం బేలా.

కం. తగవేటికి మగనాలిని
తెగుదెంపుగ మగఁడువిడువ దిక్కున్నదె? యో
మగువా మగఁడొల్లడనుచు
మొగసాలకు మొరలువెట్టు ముగుదవుగావా?

గీ. వలచి వలపించి వగలచే నలరఁజేసి
మగనిలోఁగొనఁ జాలవే మగువ వినుము

చెలిమిమైఁ జేదు మేపింప । వలనుపడును
బలిమిమైఁ బాలుద్రావింప । వలనుపడదు.

గీ. వెలిచవుల్ గోరి మెలఁగెడు । ప్రియునిఁ దాను
లోఁగొనఁదలంచినట్టి యా । లోలనయన
హావభావవిలాసంబు । లరయువలయు
మగనివలపింపవెలలేని । నగలువగలు.

కం. ఇమ్మెఱుఁగవా? యనునయవా
క్యమ్ములపద్ధతి, నెఱుఁగవా? । కలికివి గావో?
ఎమ్మెలు లేవో? కొమ్మా
పొమ్మవ్వతె నేను నీకు । బుద్ధులఁదెలుపన్.

వ. అని బోధించిన తనవదినెంగని యవ్వనితామణి,

గీ. కలికి! లొటిపిట శూలరో । కండ్లఁగాని
యణఁగ దను సామ్యమునకు మీ । యన్నగారు
వెక్కసములాడినంగాని । చక్కఁబడరు
వినయముగ నెంతచెప్పిన । వినరు కనరు.

గీ. "ఆ"యనినయంత భయవిన । యములుదోప
సతము తలలోనినాలుక । గతిమెలంగు
నట్టి మగనాలిచందాన । నతనియాన
కడుగుదాటనిదాన నే । నడుగమాన.

వ. అని వచించి, యమ్మందయాన తనడెందంబున నుప్పొంగు
దుఃఖంబు నణంచుకొనుచుఁ గన్నులఁ గన్నీరు రాకుండ

నరికట్టునట్లు చేలచెఱంగునం దుడుచుకొనుచు, లోనికేగి యెల్లరు భుజించి పండుకొనిన యనంతరమున,

సీ. కమ్మనంపెఁగతావిఁ।గడలఁ బిసాళించు
జాఱుకొప్పున జాజి।సరులఁదుఱిమి
క్రొన్నెలతలఁదన్ని । చెన్నొందుమోమున
సిందూరతిలకంబుఁ। బొందుపఱిచి
నిజతనూకాంతుల।నిగనిగల్ వెలిఁబుచ్చి
చెలువారు చెంగావి।వలువఁగట్టి
పిటపిటలాడుచుఁ। బెల్లుబ్బుగుబ్బలు
కదలకుండఁగఁ గంచు।కంబుదొడిగి

గీ. కుందనముఁబోలు నెమ్మేన। చందనం బ
లంది యుత్సాహమునను మి।న్నంది, పచ్చ
కప్పురపుఁదావి దిక్కుల।గుప్పుకొనఁగఁ
దమలపాకుల నమలుచుఁ। దలిరుబోణి.

గీ. మందహాసంబు కెమ్మోవిఁ।జిందులాడ
వలుఁద పైఠిణీఱవికెపైఁ। బైటజార
కూర్మిమితిమీఱ నాత్మలోఁ। గోర్కెలూర
నాత్మవిభుఁజూడ వగఁజెంది। యవ్వెలంది.

ఉ. కాళ్లుతడంబడన్ నగుమొ।గంబునఁ జిన్నగవంకురింప నే
నల్లచెమర్పఁ జెక్కిలియొ।కించుక కెంజిగిఁగ్రాల లజ్జచే

నుల్లముతల్లడిల్లఁ జను । లుబ్బఁగఁగన్నులుచెమ్మగిల్లగా
మెల్లగవచ్చి భర్తకు స।మీపమునన్ నిలిచెన్ వినమ్రయై.

గీ. సరసశృంగారసరసిలో । జలకమాడి
రతులహావణిల్లు భూలోక।రంభయనఁగ
నచ్చట నతాంగి యైనల।తాంగిఁజూచి
సొంపుపెంపొంద నతఁ డాద।రింపకుండె.

కం. తనుజూచి మాటలాడక
కనికర మింతైన లేక । కను లెత్తక, ర
మ్మని ప్రేమఁ గౌఁగిలింపక
తనపతియట్లున్న తెఱఁగుఁ । దలపోసిమదిన్.

మ. వనితారత్నము చేగి భర్తయని సం।భావించి ప్రాణేశ్వరుం
డని ప్రేమించిమగండు దైవమను చున్ । బ్రార్థించి, గాఢోపగూ[నా
హానమిఁబోయినయంతఁ బొమ్మని మెలం।జాయుంచు వేశ్యాంగ
జనులుందు గ్రహించునే కులసతీ।సంభోగసౌభాగ్యమున్.

కం. విటులను వంచింపంగల
కుటిలాత్మలఁ గూడువాఁడు । కులసతిసురతం
బెటు లనుభవింపఁ జాలును
అటుకులరుచి యెద్దెఱుఁగ । దనగా వినమే.

గీ. ఎదురుపాటున కెంతయు । నేడ్చుచుండ
నెత్తుకొన వేమియని నెత్తి । మొత్తుకొనిన

వానిపోలిక నాచాన । వానిపజ్జ
వెక్కికొనియేడ్చెఁ గొండదరిఁ బఱచునట్లు.

వ. అట్లు,

చం. వలవలయేడ్చి క్రిందఁ బడు । భార్యనుజూచి యతండు నీపయి
న్వలపురవంతయున్ గలదె? । నాకు నునీకు ఋణంబుదీరె లం
జలవలెనుందువో యకట । చచ్చెదొ పొమ్మనియేవగించుచు న్
బలికెను; త్రాడుచాలదని । బావిని బూడ్చెదు వారలుందు రే.

శా. వాపీకూపతటాకవాహినులకున్ । ప్రాణంబు లర్పింతు, సం
తాపంబోర్వఁగఁజాలనంచుఁగులకాం । తారత్నమత్యంతమౌ
న్గోపంబొందితపించి దుఃఖమున నుద్ఘోషింప నామూఢుఁడా
గోపీలంబకుచోపగూహనములన్ । గొండాడుచున్మత్తుఁడై.

వ. అంత నానారీమణి హితోపదేశంబునకు నైన సమ్మతించు
నని యడియాసవహించి, భర్తంజూచి,

చం. కులసతియైన భార్యమదిఁ । గోరిక లీరిక లెత్త భక్తితో
నెలమి నొనర్చు కార్యమతి । హేయముగాఁగనుపట్టు మీకు మీ
వలపులకున్ నిధానమయి । పల్కుల నేర్చు నమీమనంబు రం
జిలునటులుండు లంజ; పని । చేసిన పాతికవట్ట మాఁగదా?.

కం. వాలాయంబుగ నింటను
మేలోగులఁ బాలుఁగొనుచు । మెలఁగెడు నాయి
ల్లాలొల్లని మగవాఁడును
పాలొల్లని యట్టిపిల్లి । బాగుపడుదు రే.

కం. మనకున్నది లేనిది మును
వెనుకలడలపోయకుండ । వెచ్చించుదురే
ధనమెంతయున్నఁగలదే
మనసెఱుఁగని కలయు నొడలుఁ।మఱచిన సివముల్.

ఉ. అగ్గలమైనమోహమున । నాచపలాక్షికిఁ జిత్తమిచ్చి యి
ల్లగ్గికి బుగ్గికిన్ విడచి । యక్కటపొక్కరొ సుంతయైన? నే
నెగ్గులఁబల్కినన్ దగదె।యీసువహించినఁ బాడియా నె? కా
దగ్గదికాకమాన దని । దైవముదూఱెదఁ జావుఁగోరెదన్.

ఉ. జారులు లేరొ? యెందు నెఱ।జాణలఁగూడినవారుగారొ? నం
సారముగుల్లఁజేసి కుల।మానినిఁ బాసి యశంబురోసిరో?
"హా! రసికుండ విట్లుతగు।నా"యని యించుక వెక్కివెక్కిపై
బోరున నేడ్చి పైఁబడియె।ముద్దులగుమ్మయతండు మ్రొన్నడన్.

కం. న్యాయాన్యాయము లెఱుఁగని
యాయతిహీనునకుఁ జెప్ప । యత్నించిన యా
జాయ "అపృష్టోపిశుభం
బ్రూయా" త్తనునీతివాక్య।మును వినెనేమో"

కం. నయపద్ధతిచే నాసతి
ప్రియునిన్ వ్యసనంబునుండి । ద్రిప్పఁదలంచెన్
దయలేనివాఁడు వినఁ డా
రయఁ; జక్కిలిగింతకలదె । రాతిప్రతిమకున్.

వ. అట్లు వలవలయేడ్చి, పైఁబడిననిజకాంతంజూచి యాందూ రిట్లనుండు,

కం. ఇల్లలికినఁ బండువగునె
యుల్లాసముఁజూపినంత । నోల్లునె యుల్లం;
బిల్లాలననుచు మిక్కిలి
యుల్లాపములాడనేటి । కొడలుమఱదితే.

కం. చెఱచితివే సంసారము
మాఱచితివే గౌరవంబు? । మగనికిబుద్ధుల్
గఱపగవచ్చితివే? నీ
యఱచేతికిఁ బండ్లువచ్చె । నౌనే లంజా.

ఉ. గవ్వకుఁజేయఁ పీవడవి।గాచినవెన్నెలఁ బోలియుండు నీ
జవ్వనమీ వెఱుంగవుశ్మ।శానమునందలిపూవు చూవె? నా
నొవ్వదలంప కిట్లఱవ । నోటికివచ్చినయట్లు పేరెదే !
క్రొవ్వణఁగింతునంచుఁ బడ।ద్రోచెఁ;గులాంగనఁనిట్లొనర్తురే.

తే. అంతతోఁబోక నూరియుండు । పంతగించి
రొండుదండఁబుచేనంది । రండయనుచు
వెలఁదిఁజాఁగొట్టె దుమ్ములు । విఱుగునట్లు
మెచ్చఁదగుఁగాక యేమనఁవచ్చు నౌర.

చ. వెలవెలఁదిన్వరించియవి।వేకమునన్ధనధాన్య సంచయం
బలఁతిగ వెచ్చఁబెట్టి, వలఁపాఱడిసేసిన భర్త యెగ్గులం

బలికిన నోర్వలేనికుల। మూవిని పైఁబడు దండతాడనం
బులకు సహించునే? యుసుఱు। వోయినమేలగుఁగాక; దగ్గినన్
న్నిలువని ముక్కుతుమ్ములకు। నిల్చునె? మూఢుఁడెఱుంగకుండు నే.

సీ. వెలకాంత మొలపొంత । వలపెంతనెలకొన్నఁ
గులకాంత యనుచింత । కొంతలేదె?
ధనకాంతయనినంతఁ । దనకెంత నెనరున్నఁ
దనకాంతవలవంతఁ । దలఁపవలదె?
వగలాడివగజాడ । లోగిఁజూడ, మగవాఁడ!
మగనాలి దిగనాడ । వగవఁదగదె!
పల్లవాధరబుల్ల।సిల్లు పల్లవుఁడైన
నిల్లాలనివనుల్ల । మొల్లకున్నె?

గీ. మెచ్చి కుచకోకలకుఁ గోక । లిచ్చుగాక
గృహిణికోకరూక మొకపోక । యీయరాదె?
ఎందు కీపోక జోకగ । నేలలేక;
యేటికీధాక సానింటి । కేలమిఁబోక.

వ. వెండియు నాధూర్తుం డుగ్రుండై, విలపించిన వధించెదం జూడుము మావలికేగు మను డమ్మానినీమణి చేలచెఱంగునఁ గన్నీరొత్తుకొనుచు లేచి, యుల్లముతల్లడిల్లఁ గాళ్ళతడం బడఁ బల్లటిల్లక యించుకయోర్చి, భర్తంజూచి,

ఉ. "పొడ్చినమాడ్చినన్ బారలి। పొంగినదుఃఖము రాక యున్నెన
న్నిడ్చినఁబూడ్చినన్ మఱియు। నేపఱిగొట్టిన నేడ్చుదాన, నే

నేడ్చినఁ బాలుగారునె? యొ।కించుకకించవహించికన్నులన్
దుడ్చెడువారలుంగలరె? ।దోసము నాయది ప్రాణనాయకా!

ఉ. కొట్టిననేమి నామనము।కుందునె? నన్విడనాడి యాపెఁజే
పట్టుటఁగాదె యింతవల।వంతకుఁజిక్కితి; ద్రాడు నామెడన్
గట్టినదాది మిమ్ము నఱ।కంటనుజూచి యెఱుంగనట్టి నా
కిట్టియవస్థ రాఁదగునె? । యింతకునోర్చితి నెంతజంతనో.

కం. ఏగోడు లేక హాయిగ
భోగించి సుఖింపకుండ । భూతమువలె నా
కీగోపి దాపరించెను;
బాగోగులఁ జూడ రీరు । బ్రదుకంగలనే.

ం. నిందించిన దాసిగసభి
నందించిన భార్యగఁ జర।ణంబులఁగొలుతున్
నందింబందినిఁ, బాదిన్
నందినిఁ గావింపఁజాలి।న ఘనులుగారో ?

కం. అనరాదు గాక యాడుది;
తనవలె ధర్మంబుఁదప్పి । తప్పులగనియై
తనభార్య సంచరించిన
మన సొప్పునె చెప్పు డెట్టి । మగవానికి నేన్.

ఆ. వె. తగనిపనులు సేయు।మగవాఁడు సరసుండు
యువతిసేయునేని । యుసుఱుబోవు

నత్తకొట్టైనేని యడుగోటికుం డండ్రు
కోడలైనఁగ్రొత్త కుండయండ్రు.

సీ. అగ్నిసాక్షిగఁ బెండ్లియాడినయట్టి కాం
తారత్న మనియైనఁ దలఁపవలదె ?
కాసులోవీసంబుఁ గానరాక గృహంబు
గుల్లయ్యెననియైనఁ గుందవలదె ?
పలువురురోషించి భాషించి దూషింతు
రనియైన నించుక యరయవలదె ?
సానితో బేరంబు సంసారమున కెంటుఁ
గడుదూర మనియైన నడలవలదె ?

గీ. కాము మనునంధకారంబు కనులగప్పెఁ
గడకుఁ గడతేఱఁ గంపంత కాపురంబు
పాడిఁ జెప్పిన మీకుఁగోపంబువచ్చు
దప్పు దీయుప్పు మీకు లే దొప్పుఁదప్పు.

గీ. జలధి మీకు తియ్యని తెల్ల చెఱకుపండు
గంటు లేని యిల్లాలు మీ కంటిపుండు
విడువుఁ డీచెయ్వులనిన మీ యొడలుమండు
నెడరుగన రొండు మీయింట నెవతెయుండు.

గీ. కడకుసతియని యైన నా కడకురండు
కాఁగిలిదెగొండు వేగ మీ కాఁగిలిండు

ఉన్నమాటన్నఁ జాలు మీా । యొడలుమండుఁ
గింక; వేలెందు సానింటి । కింకఁ బోందు.

మ. అని యీారీతిఁ దెగింపులాడుతఱిఁ గా । నల్లాడఁగా శ్యాడమిన్
గనులన్ బాష్పములూరవర్షమువలెన్ । జన్గొండలం జాఱహా
యనుచుం దైవముదూఱుచున్మగనిసౌ । ఖ్యంబున్మదిన్గోరుచు
న్వనితారత్నముబోవుచున్విడిచెని । శ్వాసంబువిశ్వాసమున్.

వ. అనంతర మాహేమసుందరుండు.

గీ. "కాంతయేగాఁగదా" యని । సంతసించి
పానుపుం జేరి మెల్లగఁ । బవ్వళించి
రాత్రిఁ బాటించె బ్రహ్మచ । ర్యవ్రతంబు
జన్మమున కొక్క శివరాత్రి । సామ్యమునను.

వ. అట్లుతండు పవ్వళించియు, నించుకంతయు నిద్దుర లేమింబొరలాడుచు, లేచుచు, వెండియుం బండుకొనుచు, నేఁటిరాత్రి కంతంబు లేదోకోయని నలుగడలఁ దిలకించుచు, నేఁ డిట్టియవస్థఘటిల్లునే యని చింతిల్లుచు, గోపీఁదలంచి సంతాపించుచుఁ గన్నులఱచేతఁ బెట్టుకొని యుండునంత.

మ. సిరులాసింపకుఁడింటికేగుఁడనుచున్ । శీఘ్రంబుగా మీాపువ
స్సురతాసక్తికిస్వస్తిఁ జెప్పఁదగునం । చుం జోరులన్ జారులన్
గరుణందోలియినుండువచ్చెననుచున్ । గాఢాంధకారంబుసుం
దరునజ్ఞానములోనదుర్యశములో । నన్ దాఁగెఁ బెంపొందగన్.

క. గులగుల మేల్కాంచుపక్షుల
కలకలనాదంబు లెసఁగెఁ । గాకులు కూసెన్
వెలవెల బాఱెను దివ్వెలు
తెలతెల వాఱెను, కడలను । దెలుపులు దోచెన్.

మ. సరసుండో నెకులాంగనల్వడచి వే। శ్యాలోలుఁడో మర్జనుం?
డరయన్ నా యకులందు వాతఁడుశఠు । డో; దక్షిణుండో నె నా
వరుసన్ ? ఛాయను బద్మినీ సమముగాఁ । బాలించె దనజూడుడం
చరుణార్కుండుదయించెగాముకులుచిం। తాక్రాంతులై భీతిలన్.

వ. అనంతరము శీఘ్రముగఁ గాలకృత్యంబుల నిర్వర్తించి,

గీ. చిన్నవోయిననెమ్మోము । చెన్నదొఱఁగఁ
గనుల కెంజాయదిక్కులఁ । గడలుకొనఁగ
బలిమిఁ యుడివోవ జీవచ్ఛ। వంబుఁబోలి
హేమసుందరుఁ డారెడ్డి। యింటి కేగె.

ఉ. వచ్చినవానిఁజూచి విట। వర్యుఁడు రెడ్డికులావతంసుఁ డిం
పచ్చుపడంగ నిట్లనియె; నా। దట నా చపలాక్షి గోపి రా
నిచ్చెనె నిన్ను ? నన్నుగన। నిచ్చెనె? సుద్దుల మెచ్చు ముద్దులన్
ముచ్చటలందు నిర్వురును। పొచ్చెమునొచ్చెము లేక యుందురే.

ఉ. కోపమువచ్చెనో? యకట। కూరిమి దప్పెనొ? యేమవుప్పెనో
నా పయి? మూఁడునాలుగుది। నంబులనుండియు మిత్రుఁడైన యీ
పాపినిఁ జూడరావు; నిడు। వాలిక చూపుల నేపుఁ జూపు నా
గోపిలభించె నీకిపుడు; । క్రొంతిక్రింత నొబ్బెర కాయ రీతిగన్.

ఆ. పిచ్చుగుంటుమీఁద । వచ్చె భాగీరథి
యనినయట్లు నేఁటి । కైన నన్ను
నాగృహంబుఁ బావ।నం బొనరింపఁగఁ
జూడవచ్చె తదియ । చోద్యమయ్యె.

ఆ నిన్నరేయి నేను । నిన్నుఁ జూడఁదలంచి
యెలమి గోపియింటి । కేగియుంటి
నామె నన్నుఁజూచి । యరిగెలోనికి నిన్ను
జూడనైతి నీకు । జాడలేఁతి.

చం. అనవుడు సుందరుండు హృద।యంబుననించుక సంశయించి
యీవనితకు వీనికిం జెలిమి। వాటిలెనో యనియెంచి, వెండియు
న్ననువిడవాడియింకొకని । నాతి కనుంగొన దాచునెంచి యి
ట్లనియెను కూర్మి పేర్మియుఁబ। యల్పడఁబల్కు లఁదే నెలూరఁగన్.

చం. ఎఱుఁగవె గోపికోఁదగుల। మేర్పడి నేఁటికి వత్సరత్రయం
బరిగెఁగదా! నిజంబుగ న। లతాంగి ననున్వలపించి మెచ్చె; మా
యిరువుర దైవమిట్లు సృజి।యించి ఘటించెనుగాక యీ
సరిపడునే పరస్పరము? । జారలుజారులు లేరె భూస్థలి

గీ. ఈ వెఱుంగవె? యీయంశ । మిట్టులుండఁ
జెప్పగారాని యప్పులు । కుప్పలయ్యె
ముప్పుఘటియిల్లె నీతోడఁ । జెప్పకేమి?
చల్లకైవచ్చి ముంత దాచంగ నేల?

గీ. ఈరహస్యంబు లెవరితో । నే వచింతు
నే వచించెద వినువార । లెవరు గలరు?
ప్రాణసఖుఁడవు నినుమించు। వారు గలరె?
ఎఱుక పిడికెడుధనమందు । రెఱుఁగ వాళ్కొ?

సీ. అహహా! వెచ్చింపఁ జేతఁ గా।సైన లేదు
ప్రొయ్యిలోఁజూడఁ బిల్లి ప।రుండెఁజూవె
గ్రిచ్చపాదఁగదలించిన । కరణిఁగాదె
యనుచు నీప్రాపుఁగోరితిఁ । బ్రాణసఖుఁడ.

ఉ. జేనెడుపొట్టనింపుటకు। సీగిఘటిల్లిన, దైవ మీయఁడే?
హానితొలంగకున్నె? యని। యాత్మఁదలంచితిఁగాని రాజుపెం
డ్లానికి ముష్టివ్రాతయను।లాగున నీవు సఖుండవయ్యుఁ గా
సైనను లేకయుంటి నహ।హావిధి నేమనవచ్చు మిత్రమా.

చం. అరయస్వయంమహేశుఁడుధ।నాధిపుఁడాత్మసఖుండుమా
మయు,న్గిరులకుఁజక్రివర్తి, పరి।కింపసుతుండుగణేశుఁడైననీ
శ్వరునకుఁదప్పనేయొరుల।పంచకుఁబోవునవస్థ? యిందిరా
వరునకుఁ దప్పెనో పరుల।ప్రాపక మేనన నెంతవాఁడనో.

క. అని వెక్కి-యేడ్చిపలికిన
విని యెంతయు జాలిఁదాలి । ప్రియమిత్రునితో
ధనవంతుఁ డైన యతఁ డి
ట్లనియెఁ బీయూషవర్ష । మఁతటఁ గురియన్.

చం. అలరుల నమ్మి కట్టెదుర నమ్మినవారలు లేరొ? నేఁడు నీ
తలఁ జనించెనే? వినమె ధర్మజుఁ డెంతయు వంతఁ గుందె, నా
నలుని యవస్థయున్ వినమె? నాకును నీకును భేదమున్నదే?
యలజడిఁ జెందనేటికి గృహంబునఁ గాపురముండ వాపదల్

ఉ. ఏపువచ్చుఁ గాక సహింపరె ధీరులు? కల్మిలేములం
దోడినవారు లేరొ? గెలుపొందినవారలు లేరొ? యెంతమా
టాడితి వేను నీకొసఁగనా? విను మోడలు బండ్లవచ్చు బం
డ్లోడలవచ్చు; నే నెఱుఁగనో? గ్రహియించితి నీదు భావమున్

చ. ఎఱుఁగవు గా? కృపామయుఁడు హీనగుణాఢ్యుఁడు వారకామినీ
సరసుఁడు, వెంకునాయుఁ డను సజ్జనుఁ డిచ్చటి రాజుగారికిం
బరమహితుండు, నాకుఁ బ్రియ బాంధవుఁ డాప్తుఁడు వానితోడ నీ
చరితముఁ జెప్పినాఁడను నిజంబుగ నీకు లభించు వృత్తియున్.

ఉ. "నీతిఁ గలట్టి శూరుఁడవు నీ" వనినన్ దన ప్రాణమిచ్చు, మా
జాతికిఁ బెద్దవాఁడు, గుణసంపదలం గలవాఁడు లోకవి
ఖ్యాతిఁ గలట్టివాఁడు, చెలికాండ్రకుఁ గొంగుపసిండి యెల్లవా
రాతని మెచ్చువారలవు రాయని రాయని వెంకునాయనిన్.

చం. వెరవున నేర్పునం దగిన పేరుఁ బ్రతిష్ఠయు సంగ్రహించి సుం
దరుఁడు ఘనుండు ధీవరుఁ డనంగ నటింపుము నేఁటితోన నీ
కఱవు నశించెఁ జూవె యధికారము చేకురెఁ జూవె యెట్టులే
నిరువదిరూక లైన లభియించినఁ జాలదె నీదువృత్తికిన్.

చ. సరసుఁడు వెంకునాయుఁడు జాణఁడు సానుల మేలువాఁడు నీ
వరమరలేని భావమున వాతనిఁ గొల్చెద వేని గోపికాఁ
బరిచయమించుకంత గలుపంగలవాఁడవ యేని మిత్రమా
సిరులకు లోపముండునె? వచించితి నీకు రహస్యమార్గమున్

గీ. గోపి తనవాలుఁజూపులఁ దూపుగముల
నేపుఁజూపిన నానాఁటఁ డోపఁగలఁడె?
పాదదాసుఁ డౌఁగాక; పోవలయుఁజూవె
భానుఁ డస్తమించినయంత వానికడకు.

చం. కలనయినన్ మృగాక్షి కరుసిఁ గన్నులఁ జూడదు నిశ్చయంబ ని
న్వలచిన జాణగోపి యొకపట్టున నూఁకొన దెట్టులైన నీ
పలుకుల నేర్పుఁజూపి ధనవంతుని ప్రాపనిచ్చఁ జెప్పు మీ
వలనుల నీకుఁ జెప్పఁగలవాఁడనె నేర్పరి వీ నెఱుంగవే?

చం. అని వచియించి రెడ్డిసఖుఁ డా యువిద యాతనిఁ గౌఁగిలించి నా
యనిఁ గనివృత్తియున్ బడయు నాయని నాయనికూర్మి వర్థము
న్గానుమని యిచ్చి, వానిమదిఁ గోరిక లీరికలెత్తఁ బొమ్మనెన్;
మును విన మౌ శ్రితావన సమాన హితధర్మ యనంగఁ బాడితుల్

ఉ. ఆతఁ డొసంగినట్టిధనమంతయుఁ గైకొని సంతసించి, నీ
చేతనగాదె నేఁటికి నశించెను పేదఱికంబు, నాదు వా
క్చాతురిఁ జూపి యెట్లయినఁ గార్యము నేర్పెదఁ జూడు మంచు ల
జ్జేతరచిత్తవృత్తిఁ జనియెన్ మదిఁ బెక్కుతలంపులూరఁగన్.

ఉ. జాత్యభిమానముఁ విడువ । సత్పథవృత్తిదొలంగలేమి దు
ష్కృత్యములాచరింపఁ బెర । రేమఁగదా? యపకీర్తిమూల మీ
దాస్యమొనర్చియాతరుణి । దార్పవలెంగద; యింతకుం ధనం
బత్యధికంబు చేకుఱుఁగ । దా? మతికన్యవిచార మేటికిన్.

గీ. తార్చుటయు దాస్యకృత్యం బొ । నర్చుటయును
తప్పుగాఁదోఁచ దదియు నా । తలనలేదు;
తరుణిదమయంతిఁ దార్ప దా । స్యం బొనర్చె
సద్యశస్స్ఫూర్తి(శ్రీ)నల । చక్రవర్తి.

గీ. కలిమి బలిమిని చెలిమిని । గలుగవలయు
సకలకార్యంబుల కివియ । సాధనములు
విత్తము ప్రధానమనియుండు । విత్తమున్న
దీని తలఁదన్ను లంజలు । వేనవేలు.

వ. అని యిట్లు హేమసుందరుండు నిశ్చయించి, చని చని, వే
శ్యావాటికం బ్రవేశించి, గోపివసించుగృహసమీపమున
కేగినంత,

సీ. సంగీతనామక । స్తనముఁ ద్రుంచినయంత
విలపించుపలుకుల । వెలఁదిఁ దలఁచి
చాకిదెబ్బల కోర్వఁ । జాలక యొండ్రించు
గార్దభకంఠ సౌ । ఖ్యంబుఁబడసి
దుర్గంధభూయిష్ఠ । మార్గంబులను రేఁగు
మక్షికామశక స । మ్మతినిబొంది

జనులు రాలను ఱువ్వ । సాధ్వసంబునఁ బాఱు
వానరంబులతోడఁ । బ్రీతిఘటించి

గీ. కాక ఘూక భేకంబులఁ । గాఁపుసేసి
కాసరీక సరంబుల । నీసడించి
శాకినీఢాకినులఁ దోలఁ । జాలినట్లు
పాటలాధరి యొకపాట । పాడుచుండె.

గీ. అట్టులాలపించినపాట । నాలకించి
పాటిలేనట్టి యీంబోఁటి । కోటిసేయు
కూటమికిఁ గాక పాటకు । సూటిపడునె?
యనుచు మదినెంచి లోనికి । నరిగెనతఁడు.

వ. అనంతర మాగోపి, తన గానకళానైపుణ్య మట్లుండనిచ్చి,

చ. తనసరసుండు వచ్చెనని । దబ్బున లేచి, వియోగబాధకున్
గినిసినయట్లు వానిఁ బరి।కించి, కులాంగనకుందుఁ దీర్పఁగా
నను విడనాడిరో? యకట । నాతలఁదన్ను మఱొక్క సుందరి
న్గనుఁగొనిరో? వచింపుఁడని । నన్ విని సుందరుఁ డామెకిట్లనున్.

చ. మగువ! యెఱుంగవేమొ? యను। మానవశంబున రాకయుండునా?
తెగువకు హేతువాత్మసతి। దేర్పఁగఁ గాదు మఱొక్క సుందరి
న్దగిలియుఁ గాదు చెప్పెద య।థాస్థితి నిన్నటి రేయి యింటనే
మిగిలితిఁ జూవె విత్తమునిమిత్తము చిత్తము తత్తఱిల్లుటన్.

చ. నలినదళాక్షి నిన్నెఱుఁగ। నా? చిరకాలసఖుండ, రూకలన్
జలజల రాల్చి, ముద్దుల నొ।సంగిన పైమొగమెత్తి సుద్దులన్

బలికెదవానెజాణయని । పైఁబడి కౌఁగిటఁజేర్చి "గోపికిన్
వెలగలచేయొసంగఁగలనే" యనియిచ్చెఁబదాఱురూకలన్

వ. ఇట్లు,

గీ. రాకరాకవచ్చినయట్లు । రూక లొసఁగి
అఖిలసంపద లిచ్చినట్లలరి యతఁడు
మత్తుగొని తత్తరిల్ల న । మ్మగువచూచి
"చాలు సరసుండ విప్పుడు । సమయమగునె."

చ. అనితొలఁగించి యిట్లనియె । హా రసికుండవు నీవెఱుంగవే?
దినరతికిందడంబడుదె । తేఁకువఁదప్పి యినుండు గ్రుంకకుం
డునె? శశిరాకయుండునె? క । డుంగడునుల్లసుపల్లవింప ని
న్నెనయకయుందునేయకట । యెందుకుతొందర హేమసుందరా

ఉ. చౌకగఁజిక్కిపట్టినెర । జాణఁగదాయని యాత్మనెంచినన్
జోకగస్సేలుచున్ రతుల । సొక్కుచు సోలుచు నిన్నివాళ్లకీ
రూకలొసంగివాడ వపు । రూపముగా విధినేమనందు; నీ
రాకడలేడనేర్చితవు । రావిటరాయఁడ సంతసించితిన్.

ఉ. ఈపదునాఱురూకలకు । నింతయవస్థ తటస్థమయ్యె న
న్నీపయినెట్లు లేలెదవొ? । యెట్లుసుఖించెదనో? యెఱుంగ; నీ
కాపున నిన్నివాళ్ళుఁ గసు । గందక కుందకయుంటి నింక నా
కాపురమంతరించెఁ; గడ । గండ్లకుఁజిక్కితిసొంపుఁదక్కితిన్.

చ. అనవుడుసుందరుండు ధవ । ళాంబుజపత్రవిశాలనేత్రి వే
ధనికుఁడు నీదుకంటఁబడి । తాళఁగలండు? జగాన నేనొకం

డనెమగవాఁడనే? తగిన। నాథులు నిన్ను భరింపలేరె? మే
లౌ నరకయున్నె? పూనుమిఁక। యోపికనోపిక వాణిగోపికా!

ఉ. చెప్పెదనొక్కమాటవిను। శీతకరానన! ముప్పుదప్పి నా
యప్పులుతీరుఁదాక ధన। మంతయుఁ జేకురుదాక సౌఖ్యముల్
తప్పినఁదప్పుఁగాక, నినుఁ। దప్పిచరింతునె? యాకు బేరునిన్
దప్పక తెచ్చినీకొసఁగి। దగన్ మన కే మిటలోపముండునే!

క. ఈయూర వెంకునాయఁడు
వాయువువలెఁ బాయకుండు। వైభవజితగో
నాయకుఁ డనుసేవిత భూ
నాయకుఁడు ధనవిజితధన। నాయకుఁ డనగన్.

క. వనితలతలమానిక మని
జనులెల్లఁగూడి నిను। చక్కఁదనంబున్
గొనియాడఁగఁ జెవులారఁగ
విని యాతఁడు నిన్నుఁ గూడ। వేఁచఁరుగొనియెన్.

కం. ఈనాఁడు నిన్నుఁ జూడఁగ
నానాయఁడు వచ్చు మెచ్చు। నర్థము నిచ్చున్
బోనాడక లోఁగొనుమా
నీ నేరుపుఁజూపి వాని। నెయ్యముఁగనుమా.

కం. మనరాజగారిమిత్త్రుఁడు
ధనవంతుఁడు నీదు పాద। దాసుం డయ్యెన్.

మన కెంటులోప ముండునె?
వనజాయతపత్త్రనేత్ర । బాగుగవినుమా.

గీ. అని యతండు వచించిన । న వ్వెలంది
రెడ్డి తాను గతించిన । రేయిఁ గూడి
యనుకొనిన యట్టులాయెఁ బో । యనితలంచి
యిట్టు లనియెను తనగుట్టు । మట్టుమీఱ.

శా. చాలుం జాలుమనోహరా యెఱుగుదున్ జ్ఞా । లింపుడీమాటలిం
కేలా? నాహృదయంబెఱుంగుటకుఁ గా । దే మీరలూహించిరీ
లీలల్ క్రొత్తగ నేర్చివారొ? హృదయ । క్లేశంబుఁబొందింపఁగా?
మేలో హో! యతఁడామహేంద్రుఁడయి నన్ । మిమ్ము న్వ్యసజ్జింతు నే

సీ. అగ్నిసాక్షిగఁ బెండ్లి । యాడి ప్రేమించిన
భర్తకుఁ దొలుదొల్త । స్వస్తిఁ జెప్పి
కడుపార నన్నుఁగాంచి । కడుఁ బేర్మిఁ బెంచిన
తల్లిదండ్రులకుప్పు । చెల్లుఁ జేసి
రాకపోకలలోటు । లేకుండఁ గొనియాడఁ
గల బంధువులకు మం । గళముఁ బాడి
నన్నుఁ గన్నులను గప్పు । కొని యేలుకొను విట
కాండ్రకు భరతవా । క్యంబుఁ బలికి

గీ. తప్పిదం బయ్యె నాముప్పు । తప్పు ననుచు
నిన్ను బిగికౌఁగిటం జేర్చు । కొన్న నన్ను

వెంకునాయునికిం జేర్చి । విడువఁదగునె?
యీనఁగాచి నక్కల కిచ్చు । వానిపోల్కి.

మ. చనవుం గైకొని తన్నినన్ గఱచినన్ । జంకించినన్ వద్దువ
ద్దనినన్ బొమ్మవియేడ్చినన్ వడివడిన్ । హస్తంబులన్ బట్టినేఁ
గినుకం జూచిన జాణవేయుచుఁ జ । క్కిరివదరితపరికిరియన్
నను మెప్పించిననిన్నుఁ బాయఁగలనే । నాయందు నా కేటికిన్.

ఉ. ఏమనుదాన నేమనిన । నేమగునో గద నిన్నుఁ బాసి యె
ట్లోమనుదాన, నీవు వచి । యించినచొప్పునఁ జేయకున్న లో
నేమనినన్ను దూఱెదవొ? । యింతకుఁ జెప్పెదనొక్కమాట నీ
మోమును జూచి; నీరసమున । ముంచెదొ క్షీరమునందు ముంచెదో.

గీ. వలచివచ్చిననాయుఁడు । బావగారి
నలరఁ జేసెద నీ వని । నట్లు నేఁడు;
"ఏను నీ బాయ" నని బాస । యిచ్చెదేని?
మాటపట్టిన మనకు మో । మోటమేల?

చం. అనిన నతండు గోపిబిగి । యారఁగవుంగిటఁ జేర్చి ముద్దులన్
గొను మనియిచ్చి, మెచ్చికొన । గొళ్లనుముంగురులన్ నిమిర్చియా
వనజనితాంధుఁడై పలికె । "బంగరుబొమ్మవు నిన్నుఁ బాసి నే
మనఁగలనే? లతాంగి విను । మాయనుమానము మాని మానినీ"

గీ. వానిధన మెల్లఁ గొల్లాడ । వలయు ననుచుఁ
బొలఁతి యీరీతిఁ గావింప । వలసె మనకు

నిన్నుఁ బాసి చరింప నా । కన్నులాన
యనుచు వచియించి వలపుల । నలరఁ జేసె.

వ. అనంతరమున,

ఉ. అక్కట! తీపిఁ జాలునని । యాత్మఁ గడుంగడు నుల్లసిల్లి, "నీ
చెక్కు చెమర్పకుండఁగను । (శ్రీ)సతిఁ జేసెద, వెంకువాయనిన్
దక్కఁగొనంగ నోపుదువు । టక్కులెఱింగిన టెక్కులాడివం"
చక్కడనుండి నెవ్వడి గృ । హంబున కేగి భుజించి తృప్తిగన్.

ఉ. "ఎక్కడఁ దెచ్చెనో యెఱుగ । మింతధనం" బని యింటనుండు వా
రక్కజమంది లోనలరు । నట్టుల బియ్యముఁ బప్పుకూరలన్
జక్కని బట్టలన్ గొనియొ । సంగి యతండు పరుండె; నంతలో
జక్కవఱేఁడు గ్రుంకె నెఱ । సంజను పక్షులుఁ బాఱెగూడ్లకున్.

వ. తత్సమయంబున హేమసుందరుఁడు మేలుకొని,

గీ. కన్నులను విప్పి దిక్కులఁ । గలయఁ జూచి
పొద్దుగ్రుంకెనో యనిలేచి । ముకురమునను
ముఖముఁ దిలకించి తిలకంబుఁ । బొందుపఱచి
వెంకువాయని వీక్షింప । వేగఁ జనియె.

చం. చనిచని వెంకువాయని ని । శాంతము మెల్లగఁ జేరి లోనికిం
జని తన రాకఁ దెల్పినను । సం జనుదెంచి హసించి నాయఁడి
ట్లనియెను-రెడ్డిఁ జూచితివె । యాశనిపంపున వచ్చియుందువో
ననితలయూఁచి, భూవరున । కంతయుఁ జెప్పితి హేమసుందరా.

ఉ. వైద్యునకంటె మేటిపని పల్వురుఁ జెప్పఁగొనంగవింటి; నా
విద్యరహింపఁగాదె వనవీధులపై నధికారమున్న; దు
ర్భేద్యవనాగ్రులేలుటకుఁ బెద్దతనంబు నృపుండొసంగెఁగా
రోద్యమభారమూని నరపోత్తము చిత్తముఁ గొమ్ము మేలగున్

సీ. ఘోరకాంతారసీమాధికార మొందు
చేకురెంగద యనిసంతసింపవలయుఁ
బను లొనర్చిన కొలఁది రాబడియుఁగలదు
వేతనము స్వల్ప మనియెంచి విడువరాదు.

గీ. వనములన్ బర్వతముల సేవకులఁ బెట్టి
సొంపుదైవాఱ నీవు పాలింపవలయు
భళిర రసికుండ విప్పుడు పాలకుండ
వైతివి ఫలించె నేఁడు నీజాతకంబు.

చం. పతి నినుమెచ్చునట్లు పనిపాటుల కెంతయు సాతసించు న
ట్లితరు లొనర్చుతప్పుల గ్రహించి యెఱుంగని యట్లులుండుమా
యతివినయంబుతో ననిన నాఖలుఁడౌదలయూచెఁ జిత్తమం
చతివినయంబు ధౌర్త్య మను నార్యుల వాక్యమెఱుంగకుండునే

ఉ. వెండియు నాయఁడిట్లను వివేకముఁ గల్గి మెలంగుమింగిత
జ్ఞుండని భూమిపాలుఁడు నినుంగొనియాడినఁ జాలు వాడు రా
కుండ నొనర్చి కష్టములు కోర్చిన మేలుగఁ గాదె? యద్దియ
ట్లుండెఁ; బమఱొక్కమాటకు సదుత్తర మీఁగలవంచు నెంచెదన్.

ఉ. పాటలగంధిగోపికళ పాటవ మొప్పఁగఁ దేనె లూరఁగన్
బాటలఁ బాడు జాణయని పల్వురు గొప్పఁగఁ జెప్పుచుందు రా
మాట నిజంబె? పామరుల మాటలలో నిజముండ దైన మో
మోటము దక్క చెప్పెనిజ మోయనృతంబొ యెఱుంగఁ గోరెదన్

ఉ. గానకళారసగ్రహణ కౌతుకడుం గడు హెచ్చె; గాయకుల్
వీనుల కింపు నింపరు చలింపక పాడిననేమి? స్త్రీకళా
నూనవికస్వరస్వర సోల్బణముండకు, నిశ్చయంబుగా
పానులఁ జెప్పిచెప్పవలెఁ జానలనెల్లఱఁ బాడనేర్చినన్.

వ. అనిన విని చిక్కఁగదాయని సంతసించి,

చం. సరసులు గోపిపాటవిని సన్నుతులీయఁగ నేనువింటి రాల్
కరఁగి స్రవింప, శుష్కతరు కాండము వెండియుఁ బల్లవింపసు
స్వరమునఁ గంచుగంటవలెఁ బాడఁగ నేర్చినకంబుకంఠి, యా
తరుణినిఁ జెప్పిచెప్పవలెఁ దక్కనసానుల గానమాధురిన్.

ఉ. స్వైరవిహారధీర రతిసంగతుల న్నతిఁ గొన్న ప్రౌఢ సం
సారిణిఁ బోలియుండు నెఱజాణ నిజంబుగ దానిబోలుశృం
గారవతిన్ మఱొక్కరితఁ గానము గానముటుండనిందు; మీ
కోరికఁ దీర్చు నామెయనుకూలగతిన్ బహుభాషలేటికిన్,

ఉ. అక్కట వెంకునాయఁడని సంతనయా మెఱుఁ జెప్పకేమి? నా
నైక్కలు చెమ్మగిల్లుఁ దనుసీమ గగుర్పనఁ దల్లడిల్లు; జన్
ముక్కులకంచుక్రుతుటన ముణ్ బొనరింపఁగ నుల్లసిల్లు మ
క్కువమెట్టిదో యెఱుఁగు మన్మథుఁడొక్కఁడు నిక్కవంబుగన్

గీ. భోజనముఁ జేసి మీఁద లం। భోజవదనఁ
జూడఁదగియుండు రండని । సుందరుండు
వెడలె; వేశ్యా। వేశప్ర। వేశమునకు
గాన మనునది ప్రథమసో। పాన మాఱె.

గీ. హేమసుందరుఁ డాగోపి। యింటి కేగి
రొట్టెవిఱిగి నేతంబడ్డ । యట్లు లయ్యె
నాఁటి యని పూసగుచ్చిన । రీతిదెలిపె
జరిగినయుదంతమంతయు । సంతసమున.

వ. గోపికయుం బరమాహ్లాదంబుఁ బొంది మీకళత్ర్యమగు కా
ర్యముండునే యని యనేకవిధంబులం గొనియాడుచుఁ గౌఁ
గిటం జేర్చి, సరససల్లాపంబుల నాపల్లవుని యుల్లం బుల్లసి
ల్లం జేయుచు మెల్లగ లోఁ గొనియె. వెండియు,

గీ. ముద్దుగుమ్మ తేనియలూరు । సుద్దులాడి
ముద్దులనొసంగెఁ గడగొట్టు । ముద్దు లేమొ?
పోకలనొసంగి పైఁదెల। నాకు లిచ్చె
నిపుడు విడుగర యుల్లాకు । లిచ్చెనేమొ ?

వ. తత్సమయమున,

సీ. తైలసంస్కృతకేశ। జాలంబు వ్యామోహ
పాశజాలనిబద్ధ। పక్షిఁ దెలుపఁ
దిలకచిత్రితఫాల। ఫలకంబు నిజగూఢ
గాఢానురాగ ని। గూఢిఁ దెలుప.

వక్షోవలంబిత । పద్మసవమాలికనిద్ర
రోధరతీనాథ । బాధఁదెలుపఁ
దనులిప్తచందన । ఘనసారవాసనల్
తనమనోమలినవా । సనలఁదెలుపఁ

గీ. గాలమేఘోపమితదేహ । నీలకాంతి
యతులకామాంధకార మా । హాత్మ్యంబుఁదెలుపఁ
డెంద మానందముం బొంద । మందగతుల
నోడ కేతెంచె నాయఁడ । ప్రోడజూడ.

మ. అహహా! యాత్మసతీపవిత్రముఖచం । ద్రాలోకజాత్యంధులై
కుహనారాగధనాంగనాముఖకుహ్యా । ఘూకంబులై మోహా
విగ్రహులై దుర్విటభోగజాతసుఖరో । గగ్రస్త వారాంగనా
గృహముం జేరుదు రిట్టికాముకులు సం । గీతాపదేశంబునన్ -

వ. సడిఁబట్టి నాయండే తెంచెనని గ్రహించి హేమసుందరుం
డెదురేగి,

గీ. అతని వీక్షించి, రం డని । యాదరించి
యాసనముఁజూపి యిదిమీగృ । హంబయనుచు
నిచ్చకము లాడి యాతిథ్య । మిచ్చి వెడలె ?
వినమె "అభ్యాగతః స్వయం । విష్ణు" వనఁగ.

గీ. హేమసుందరుఁ డారీతి । లేమివలన
దానువలచినపొలఁతుకఁ । దార్చఁగాని
యాత్మలోఁ బరితాప మ । త్యధికమయ్యె
నింటి కేరీతి వచ్చెనో । యెఱుఁగఁ డతఁడు.

సీ. ఉల్లంబు రంజిల్ల । మల్లెపూవులఁ బోలు
నన్న మంతయుఁ గ్రొత్త । సున్నమయ్యె
దాలిమిం గానఁదగు । మేలిమితాలింపుఁ
గూరలన్నియు మిత్తి । కోఱలయ్యెఁ
పరిపక్వవిధులను । సరిలేక యొప్పారు
పప్పు లన్నియుఁ బాత । చెప్పులయ్యె
నల్లారు ముద్దుగ । నిల్లాలు పలికెడు
పలుకు లన్నియు వాడి । ములుకులయ్యె

గీ. నాలు తేలయ్యె, నిల్లు ము । ల్లయ్యె నకట
యాలినొల్లనివానికి । నీలకూర
చప్పగా నుండు నంచు రా । సరసుఁ డింట.
నెట్లు భుజియించి బ్రదుకునో । యెవ్వఁ డెఱుఁగు.

గీ. మనము గోపి కొనసంగి మైత్ర । మఱది యాతఁ
డేమిభుజించెనో మది । నెఱుఁగకుండెఁ
బందుకొన నెంచి మెల్లగఁ । బఱుపుఁ జేరెఁ
బఱుపుగా దది తనమేని । కుఱుపుగాని.

శా. ఓరా! చక్కనిచుక్క డక్కెనని నే । నాశించితింగాని, నా
దారిద్ర్యంబోకభూతమై పరునకుం । దార్పించె, నిర్భాగ్యుఁ డా
సారంగాక్షి రమింపఁగాగలఁడె? యా । చక్కందనం బాహారం
గా రామామణి కేతగుఁ బలుకు లే । లా? యేలతేకుంటిఁగా!

శా. ఆమోవింగల కెంపు నానగు మొగం। బా కన్నులా చన్ను
హా మేల్మేలని మెచ్చ వచ్చుఁగదరా। యా చెక్కులా ర్థక్కు
రా! మైఁదీవి, బళారె, యొప్పుఁదగురా। యా టక్కులా టెక్కు
లా మాఱత్నముఁ బోలు నామగల దా। రామా జగన్మండలి

సీ. మతిమాలి గతిఁదూలి। రతికేళిఁ బాసితి
గోపికా దదిసుధా। వాపిగాని
సిరిలేక నరిలేని। గరితఁ బర్చించితి
వాతిగా దది మూరు। హేతిగాని
బ్రితిమాలు సతినేలు। ధృతిగోలుపోయితి
భామగా దది రతి। సీమగాని
వగలాడి దిగనాడి। జగమోడినట్లైతిఁ
గాంతగా దది జగ। జంతగాని

గీ. తలఁపు తులకింప, వలపులు। తొలకరింప
వాలుఁగంటిని ముద్దార। నేలుకొంటి
మేలుకొంటి నిప్పుడు గోలు। గోలు మంటి
మాటికిని మింటికిని మాట। లంటె నంటి.

గీ. పోకలకు రూకలంగొను। పోకలాడి
యిచ్చకములాడి యేల్కొను। మెచ్చులాడి
దానిసరియైనజాణ జ। గానఁ గానఁ
దలఁప వాలంజె తియ్యాని। తాటిముంజె.

సీ. మరులుగొల్పెడుకల్కి । మరునియారవముల్కి
మురిపెంబులకునండ । విరులదండ
పూదేనియలచాలు । పొంకంబులకుఁ బ్రోలు
అందంబులకు నిక్క । యతనుఁధక్క
రమణులపూసెజ్జ । రతులనేరుపుబొజ్జ
వెరవులపోఁడిమి వా । వేల్పుటావు
మణితంతువులవిన్న । గణుతికెక్కినజాణ
నాప్రులదీని ప్రా । వింతుకోవి

గీ. మంచియన్నులమిన్న లే । మావిగున్న
భళిర ! పూవిన్నెరతిచేతి । పసిఁడిగిన్నె
ముచ్చటింపంగఁదగుకొమ్మ । ముద్దుగుమ్మ
దాని సరిసాటిఁగాన నెం । దేని గాని.

సీ. జిగిమీటి పగఁగూర్చి । జగడంబులనుగోరి
మురిపించుముద్దుల । మోవిదాని
అలజక్కవలపెక్కు । లణఁగఁదొక్కఁగనిక్కి
జక్కలించెడుగబ్బి । చనులదాని
ఘనవాహనులను దీను । లనుజేయు శృంగార
ఖనులఁబోలినలేడి । కనులదాని
అలపద్మకుసద్మ । మగుపద్మమును మీఱు
గోముగల్గిన నిందు । మోముదాని

గీ. సీటుగలరతి భవిలువున నీరుగాగ
నొడలుపులకింపఁ జేయు నుర్ దొడలదాని
నాయనికిఁ దార్చి యతను సంతాప మోర్చి
మరులుకొంటి, నిట్లొంటినైతిఁ బొగులుచుంటి.

గీ. స్వార్థనాశంబు వైరాగ్య మనగ నిట్టు
తనదు సౌఖ్యంబు పెరలకు ధారవోసి
అతివ యగురాధయున్ నేను సగ్గలముగ
నగ్గమైతిమి మరుబారి కక్కటకట.

ఆ. విత్త మీయవచ్చు విలువఁ జెప్పగరాని
ప్రాణ మీయవచ్చు భయముదక్కి
తానువలచినట్టి తరుణి నొక్కని కిచ్చి
ఇట్లు విరహ తాప మొనయఁదగునె.

చ. నడుమసియాడ నేత్రనలినంబులొకించుక మోడ్పుఁ జెందవ
దుడుకునఁ జన్నుఁదోయి కదుఁ ద్రుళ్ళఁగ మైఁబులకల్జనింపన
దొడలునటింప, నంగనకు నంగొననంగజసంగరంబునన్
గడపయివీటిసానిగతిఁ గ్రాలుగ దామదియుల్లసిల్లగన్.

గీ. చెఱకువిలుకాని గరువంబు చెల్లనీక
అద్దిరాయని ముద్దుల యప్పుదీర్చి
వలచి వలపించి నన్నేలు పొలఁతి బాసి
గాసిలితి జాలి గతిదూలి బైసిమాలి.

శా. హేయంబో ఘనమోహసుఖ మ్మావగతో । నిన్నాళ్ళు నక్కామినీ
మాయావాగురఁ జిక్కియున్ మదనసా । మ్రాజ్యంబు పాలించితిన్
హాయిన్ జెందితిఁ గంటగించె విధియు । న్యాయ్యంబుగావించె నీ
నాయం డొక్కఁడు దాహరించె నకటా । నాజన్మ మింకేటికిన్.

గీ. జిలుఁగువలిపంబుతోడఁ దా । జలకమాడ
వెనుకపాటున నేఁబోయి । కనులుమూయఁ
జనుల నాచేతులన్ దార్చు । సకియఁ బాసి
విరహబాధకు లోనైతి । వెడఁగుభాతి.

గీ. మురళిమురళించు కలకంఠి । మోహనాంగి
లలితరతిమహోద్యాన లీ । లాకురంగి
సరసులమనంబు భేదించు । స్మరుఫిరంగి
అలఁతియే యాపె నాహృద । యాబ్జభృంగి.

క. ఇంటంగల చక్కనివా
ల్గంటిన్ బొమ్మంటి మచ్చె । కంటి! విను ని
న్నంటుకొనె నొక్కఁ డక్కట
రెంటికిఁ జెడి కుందినట్టి । రేవడ నైతిన్

వ. ఇట్లపరిమితచింతాభరస్వాంతుం డై యా హేమసుందరుండు.

మ. వలపించెన్ వలచెన్ వెలందియనుచున్ । భావించు భావించి క
న్నులమూయు న్గనులట్లమూసి సఖు నిన్దూ । షించు దూషించి ది
క్కుల నొక్కుమ్మడి జూచు జూచుచుఁ గడున్గో । పించుఁ గోపించుచు
న్వాలపించున్ బలవించు నించుకలు కా । సింగాంచి నల్గించుచున్.

మ. కులుకుంబ్రాయపువన్నెచిన్నెలను జెక్కుల్చూపు వాల్గంటి
పూవిలుకాసిన్ వలపించుజాణమెయితీవి స్వేల్పుపూఁబోండ్లయా
దలఁదన్నంగలయందకత్తె యనుచు న్దైవంబునో నాడుచున్
వలవంత న్దపియించుమన్మథునకు న్బ్రహ్మాణ్యము న్వెట్టుచున్.

చ. జిలజిలపూఁవుఁ దేవియలఁ జిల్కు సుముద్దులఁ గుల్కు గోపికోఁ
గలకలనవ్వి నాయఁడల కాముకు సోముని మెచ్చవంచుఁదా
వలవల యేడ్చి యేడ్చి తన వాన్పునఁబొర్లుచునుండ భల్లవ
న్దెలదెల వాఱజాఱెసలు దిక్కుల జుక్కలు కోడికూతతోన్.

సీ. తెలవాఱె బ్రదికితి వలవంతయొల్లండె
నృపుఁ జూచి యుద్యోగ మొనయువలయు
ననిలేచి వేవేగఁ జని స్నానముం జేసి,
దబ్బున ధౌతవస్త్రములఁ దాల్చి
వడిఁబోయి యానృపు ద్వారసీమను వేచి,
తెఱఁజూచి తనరాక నెఱుకపఱచి
సర్వోషధంబుల సంగ్రహించిన రాజ
వైద్యుండ వెండియుఁ బండితుండ

గీ. ననుచు వచియించి పలుకుల నలరఁజేసి
నృపునియాజ్ఞను దలఁదాల్చి వృత్తిఁబడసి
వచ్చుచుం బోవుచున్ రాజు మెచ్చుకొనఁగ
బ్రదుకుచుండె రవంతయు వంతలేక.

వైద్యమునఁ గొంత తనవృత్తి । వలనఁ గొంత
విత్త మార్జించి యన్యదు । ర్వృత్తి మఱచి
యప్పులను దీర్చి, యిల్లాలి । మెప్పుఁబడసె
బంధువులు మెచ్చుకొన హేమ । సుందరుండు.

ఇట్లు వత్సరద్వయంబు వెచ్చించి
సేవకావృత్తి తగ దంచు । నెనగించి
నిఖిలదుర్జనసేవిత । నృపునిఁగొల్చు
వృత్తికిఁ దిలోదకంబుల । విడిచెఁ దుదకు
వైద్యవృత్తియె జీవనో । పాధి గాఁగ.

సంకట మెట్టిదో యెఱుఁగు । జ్ఞానమునింతయు లేక వేళ్ళవె
ల్లంకులు దెచ్చియౌషధము । లక్షగ్రహాభాగములంకరించి వే
షాంకితభేషజంబున ధ । నార్జనసేయుచునుండెఁ బాపమా
జంకుఁబొలంగ నేపని నొ । నర్చుట కింక తెగింపకుండునో?

రాజవైద్యవిఖ్యాతిఁ గు । గ్రామములను
జనులవంచించి విత్తంబు । సంగ్రహించె
వానిసిద్ధౌషధంబునఁ । గాని రోగి
నాకలోకంబుఁ జూడఁ డే । నాటికైన.

అమరవిభుఁడగు నూరుయా । గములవలనఁ
గవివరుం డగు నూరుశ్లో । కములవలన
వరుస నూర్వురఁ జంపిన । వైద్యుఁ డగును
జ్ఞాన మట్లుండ నిందు ని । క్కంబు వినుఁడు.

వ. ఇట్లు దినదినప్రవర్ధమానుండై (రాజభిషఙ్మణిమార్తాండ) కలియుగధన్వంతరీత్యాద్యసత్యబిరుదాంకితములం బ్రకటించుకొనుచు, మృదుమధుర వాక్చమత్కారధురీణుండై, సామదానసమాకర్షితకర్షకాదిజనహార్షవర్షితధనశీర్షుండై, మదాంధుఁడై వెండయుఁ గామాంధుండై,

గీ. గోపికయ్యెకు నాయుండు । దాపరించె
నార యా యాస యాయాస । మయ్యెననుచు
మదిని జింతించి తుదకు మ । న్మథునిరాజ
ధాని యననొప్పు నొకయొడ్డె । సాని వలచె.

గీ. సరసనయనాభిరామ వే । శ్యాలలామ
వదననిర్జితసోము, యు । వగుణధామ
అతులనీలరోమస్తోమ । శతసహస్ర
యువకసంగ్రామసీమ యా । యోధభామ.

సీ. తనదుపాప్రకుని సుం । దరుని మోహించిన
యట్లు నటించి ర । హస్యఫక్కిఁ
గామాంధులౌ విట । కాండ్రనాకర్షించి
యశ్రాంతమును ధనం । బపహరించి
సుందరుందక్కఁ బు । రందరునైనను
కన్నెత్తిచూడదీ । కన్నెమిన్న
యనునట్లు మెలఁగి వై । ద్యావదేశంబున
నార్జించు నాతని । యర్ధరాశి

గీ. సంతతము నొయ్యనొయ్యన సంగ్రహించి,
యొక్క నాడర్ధరాత్రి నా మోఘభామ
యెడకో యేగె నిశ్శంకతోడ నకట
వేశ్యలను విశ్వసించి వివేకి యగునె?.

గీ. మంత్రి మనుచు వైద్యం బంచుఁ దంత్రి మనుచు
జనులవంచించి యార్జించు ధనము ఘనమె?
ఘనమయ్యెఁగాక యద్దాని ననుభవింపఁ
జాలునే యెట్టివాఁడైనఁ గోలుపోవు.

వ. అనంతర మా హేమసుందరుండు,

ఉ. ఆనలినాక్షి మెల్లఁగ మదార్జిత విత్తముఁ దొంగిలించి మో
హానను జూపకుండఁ జనె నంచుఁ గనుంగడుఁ గుందుచుండ నా
లోనొకఁ డేఁగుదెంచి, మనలోకము వాఁడనరాదు నాయఁడ
జ్ఞానదశన్ బరుండె ననఁగా విని యెంతయు సంతసించుచున్.

ఉ. పాపము పుణ్యమో యెఱుఁగు భారము దైవము మీఁదనుండు
జూ, పోవమి వేఁగి వేఁగి మది నొందుదలంపక మిన్నకుంటినా
గోపినిఁ గోలుపోయి కడుఁ గుంది కృశించితి నేఁడు నాదు సం
తాపమణంగె, నాయనికిఁ దప్పదు చావు, విషంబొసంగెదన్.

వ. అని నిశ్చయించి యక్కపటవైద్యుండు,

ఉ. పండినపంటకై పిలుచు వైఖరి వచ్చినవాఁడు "వేగమే
రం" డనుచుండ నౌషధకరండముఁ గైకొః ధౌతవస్త్రముల్

మొందుగఁదాల్చి, నవ్వుచును। మీసముదువ్వుచు రాజమార్గమం
దండజయానలం గనియొ। యారముఁ జూపుచు మాటలాడుచున్.

చం. చనిచని రాజవీధిఁగల। సౌధమున న్నివసించునాయనిన్
గని యెటులుండెఁ జెప్పుడని। నన్ వినియాతఁడు శూలబాధకున్
దరువ్రవశంబుగాదనిన। నవ్వుచు "మేలగు నౌషధం బొసం
గిన"నని హస్తనాడిఁబరి। కించి యొసంగె విషంబు నిర్దయన్.

గీ. ఆతఁడు విషంబు సేవించు। నంతదాక
వేచి, నిద్రింపుఁడని చెప్పి। వెడలివచ్చి
యితరులం జూచి నాయండు। బ్రతుకఁజాలఁ
డనుచు వచియించి, యాత్మగృ। హంబుఁజేరె.

వ. అంత,

గీ. జౌర నాయండు గతియించె। ననెడివార్త
యఖిలదిక్కుల వడివడి। నాక్రమించె
వ్రళయకాలకల్లోల వా। రాశిలీల
నల్లకల్లోలమైయుండె। నాపురంబు.

సీ. ప్రాణాంత మానంత। వ్యాధిలే దనువార
లాయువింతకు స్వల్ప। మనెడువారు
దానమందంతటి। త్యాగి లేడనువార
లైననించుకలోభి। యనెడువారు
మనసుందరుం జౌర। ఘనవైద్యుఁ డనువార
లమృతహస్తుండుగా। డనెడువార

లనుమానముగనున్న । నదియేమొ యనువారు
మన కేటికామాట । యనెడువార

గీ. లవని శాశ్వతం బెయ్యది । యనెడువారు
జనులు పుట్టుట గిట్టుట । కనెడువార
లిట్లు కొందఱు నందఱు । నెల్లయెడలఁ
బొక్కి పొరలిరి పురపుర । పురమువారు.

గీ. చంపఁ దలపెట్టి ఘోర విషం బొసంగె
ననెడుదుర్వార్త యంతట । నాక్రమించి
యింత యంతయ్యె నంత మఱెంతయయ్యె.
సుందరుని వైద్యవృత్తియు । శూన్యమయ్యె.

గీ. ఉన్నధనమంతయు హరించె । నోర్ధ్రిభామ
వైద్యవృత్తితో క్షీణించెఁ । బలుకుబడియు
ననుచుఁ జింతించి గోపికి । నభయ మిచ్చి.
ధనము వొడియు సార్జింపఁ । దలఁచి తలఁచి.

ఉ. "పాటలగంధి గోపి నెడ। బాయఁగరాదు పురంబునందు నా
యాటలుసాగిరా" వని। నిజాత్మఁదలంచి మఱొక్కయూరిలో
మాటలనేర్పునన్ మగుడ । మందులనిచ్చెద నింతవంత నా
కేటికిఁ; బూరి మేపిదునె । సృష్టియొనర్చిన దైవమక్కటా.

సీ. తనకు దక్షిణబాహు । వననొప్పునాయనిఁ
జంపితి రెడ్డి కోపింపకున్న?

తనపాణిసఖునిఁ జంపిన నన్ను భూపతి
వీక్షించెనేని చంపింపకున్నె?
విషమిచ్చి నాయనిఁ బిలుకుమార్చితి వాని
యిల్లాలు ననుఁజూచి యేడ్వకున్నె?
జనరంజకునిధనిం జంపితి వానియా
శ్రితకోటి నన్ను దూషింపకున్నె?

గీ. పౌరబృందంబు పాపాత్మువైద్యుఁ డనుచు
నన్నుఁదిలకించునపు డాత్మ నెన్నకున్నె?
చాలు నీపురి కొకనమస్కారశతము
బ్రదికియుండఁగ నొండుపురంబు లేదె.

వ. అని నిశ్చయించి యాదుష్టవైద్యుండు కుటుంబసహితుండై గోపియు వెంటరా, నర్ధరాత్రంబున నతిరహస్య ప్రకారంబునఁ దత్పురింబాసి చనియె.

—ఆశ్వాసాంతము—

చం. సరసిజపత్రనేత్ర, శివసన్నుతదివ్యచరిత్ర సత్కవీ
శ్వరనుతకీర్తిపాత్ర నిజభక్తజనాఘలతాలవిత్ర ని
ర్జరనుతజైత్రయాత్రపరరాట్కులకాననవీతిహోత్ర సుం
దరతరనీలగాత్ర, నతదానవమిత్ర పవిత్రగోత్రజా!.

కం. వరమునిసరసిజభాస్కర
కరధృతశితఖడ్గచక్రఘటితయశోభా

సుర, సురదానవపూజిత
చరణాంబుజ యంబుజభవ సన్నుతచరితా.

భుజంగప్రయాతవృత్తము.

యశోవాహినీక్షాళితాంభోజవైరీ
యశోదాయశోదామహాత్కార్యకారీ
ప్రశాంతాల్పహాసస్ఫురత్పాండునేత్రా
నిశాటాన్వయధ్వంసనిర్ణీతయాత్రీ.

గద్య:—ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్ష ప్రసాదిత సత్కవితాలతా ప్రసూనాయమాన నవీనప్రబంధం
బైన హేమసుందరోపాఖ్యానము
నందుఁ బూర్వోదంతంబను
ప్రథమాశ్వాసము.

శ్రీరామచంద్రాయనమః

శుభమస్తు — అవిఘ్నమస్తు



# ద్వితీయాశ్వాసము.



క. రామా! వదనవినిర్జిత
సోమా! జితషంశురామ। సుగుణస్తోమా!
శ్యామానుతనవమేఘ
శ్యామా లోకాభిరామ। సంగరభీమా.

గీ. అవధరింపుము నీకు నా।మాంకితముగ
నొప్పిదంబుగ నిప్పుడు। చెప్పఁబోవు
నవసుధారసమిళిత సూ।నమకరంద
బిందుసందోహమైన న।వీనగాథ.

మ. కలదుత్తుంగతరంగరంగము లనం।గంగాళిలు సౌధంబు
జెలువున్ మీఱిసుధారుచిన్ దనరు నా।క్షీరాంబుధింబోలి
చలదంభోరుహమై, వణిగ్జనులకున్। సంస్థానమై పా
కలనాదం బనుపట్టణంబు భరత।క్ష్మామండలీ రత్నమై.

చం. జగమున నెందుఁ జూడని విశాలవనంబుల సందడించు నా
ఖగముల కాకలీకల వికస్వరరావముతోడఁ గూడి, త
న్నగరనవీనగాయకుల నాదము దిక్కులఁ బిక్కటిల్లుటన్
దగునది పెద్దలెల్లఁ గల నాదము పేరిడి రింపునింపఁగన్.

చం. పరభృత మాపురస్థ పరవారవధూకల నాదమాధురీ
గరిమకు నోడి, వాణికయి గాఢతపఃక్రియ లాచరించి త
ద్వరమహిమన్ వహించినది భాస్వర సుస్వరమాధురిన్ వసం
తఋతువునంద; లేని యెడ దక్కిన వేళలఁ గూయకుండు నే.

గీ. వారకామినీసంగీత వైభవమున
శారికాకీరకలనాద కారణమున
నరయ నా పేరు సార్థకం బగును గాక;
పూర్వ మా పురవర మొప్పు ముక్తయనఁగ.

మ. ఘనసౌధస్థసతీమణీకరయుగోత్ఖాతాంబరహ్రాదినీ
కనకాంభోరుహకాండతాడితనభః కాంతామణీకుట్మల
స్తనహారప్రవిముక్తముక్తలను సౌధశ్రేణి రాజిల్లుటన్
మును పాపట్టణరాజ మొప్పెఁ బుడమిన్ ముక్తాహ్వయఖ్యాతితో.

చం. అనిశము సాలభంజికల యందమునన్ జెలువొందు మేడలన్
ఘనములఁ దత్తటిల్లతలఁ గాంచి విటుల్ కబరీభరంబుగాఁ
గనకసమానవర్ణతను కాంతులుగా నల సాలభంజికల్
వనితలుగా భ్రమించి కనుపట్టుదు రప్పురిఁ గీలుబొమ్మలై.

సీ. తడఁబాటునకుఁ గాదె । తలకొట్టువడ బ్రహ్మ
యనియెన్న రతని సా।ధ్యయనపరులు
పోట్లాడఁజాలక । పోటయయ్యెనరుండు
పోటయేయందురి రా।పోటుమగలు
కుడువనా పెట్టనా । కూడఁబెట్టె కుబేరుఁ
డార్యుఁడేయని యందు । రర్యజనులు
వీడు వీటింబుచ్చు । వాఁడేటి నాగేటి
జోదందురి మాసలిని । పాదభవులు

గీ. ఆత్మధర్మంబుఁ దప్పని । యనఘు లెపుడు.
న్యాయమార్గంబు విడువని । యలఘుమతులు
మోస మిసుమంత లేని సు।బుద్ధులతుల
భక్తు లార చతుర్వర్ణ।పౌరజనులు.

ఉ. కచ్చియయందుఁ జేకురిన । గాయము కాయమునందు భూష
మెచ్చులఁగాంచి వైరులకు । మృత్యువుసంఘటిలంగఁ బోరి
వ్వచ్చుఁడువచ్చుఁగాక యల । భర్గుఁడువచ్చినవచ్చుగాక,
లచ్చికిహానిలేదని చె।లంగుదు రచ్చటి పాదసైనికుల్.

మ. అభిమానంబురతిప్రసంగములయం।దాసక్తి దుర్మార్గ
సభికవ్రాతములన్ మెలంగుటయసా।త్సాహిత్యచాంపేయసా
రభమున్ వాసనఁజూడనట్టి మధుపా।ప్రఖ్యాతివేశ్యాంగనా
సభలందాండవమాడువైశ్యులదురా।చారంబులగ్రాహ్యము

గీ. వేల్పుమ్రాని కొమ్మలవాఁడు । వేల్పుఁగొమ్మ
లనిశమున్ గోటకొమ్మల । నాశ్రయించి
దేవతటినికి, ఖేయవా । ర్ధికినిఁ బెండ్లిఁ
జేయఁబోలదే యంచు వ । చించుచుండు.

సీ. మాకుంభకరినత । మానినీ స్తనములు
దొంగిలించినవంచు । ఘూళియెత్తి
మదమింక స్తనముల । మర్దింపుఁ డనునట్లు
ధ్వనిఁ జేసి పీనకుం । భములఁ జూపి
మామందగమనంబు । మగువ నేర్చెనుగాక
మముఁబోలదనుచు మం । దముగ నడచి
దిగ్గజంబులు మాకు । మొగ్గియుండు ననంగ
నలుదిక్కులకును తుం । డములుసాచి

గీ. యందమున కోడి తెలఁబాఱు । టట్టులుండె
దానమున కోడిగాదె పా । దములనాశ్రి
యించె మేఘంబుఘనమె మా । కెందుననుచు
గజము లప్పురరాజమా । ర్గములఁ గ్రాలు.

సీ. విటపమాత్రంబుగ । నటవీస్థలిం జేసి
వ్యోమమండలంబు లో । ష్టముగఁ జేసి
స్రోతస్వతినిఁ జూచి । సూత్రమాత్రముఁ జేసి
వార్ధిలంఘించి ప । ల్వలముఁ జేసి

సప్తశైలంబుల । సర్షపంబులఁజేసి
లోకత్రియంబు క్రోడీకరించి
యొప్పుగ నుప్పరం । బొక్కడొప్పుగఁజేసి
వాతావరణము స్థావరముఁజేసి.

గీ. పృథుఖురక్షిఘాతసంభూత । విస్ఫులింగ
రుచులకినునిఖద్యోతము । తుత్రినిగఁజేసి
కనఁబురంగము । లాకురంగము లనంగ
వరతురంగములగము లాపురిఁజెలంగు.

సీ. తనయశస్సౌరభ । తతిదిక్కులఁజెలంగ
మధువనంబులనేలు । మాధవుండు
తనదుపూర్వనినాదము దిక్కులధ్వనింప
వాహ్యాళిసాగించుఁ । బంచశరుఁడు
తనపండువెన్నెల । వనితలఁగరఁగింప
సౌధవీథులఁజూచుఁ । జంద్రముఁడు
తనగంధవహనామమును సార్థకముఁజేయ
గంధంబువెదజల్లు । గంధవహుఁడు

గీ. తనమనోహారకలనాద । మినుమడించి
పాటలంబాడు నెలుఁగెత్తి । పరభృతంబు
పౌరజనమనోల్లాసమే । వరుసనుండుఁ
బలుకశక్యంబె? యూహింప । వలయుఁగాక.

గీ. మలయగిరి చందనశ్రీల । మాటయేల?
దేవవనసౌరభశ్రీలఁ । దెచ్చి చల్లు
నచటిసౌరణంబుల మల । యానిలుండు
వలచి వలపించునో పురిం । గలజవాళి.

ఉ. దండకుఁ జేరిపల్లవుఁడు । "దండనొకించుకనెత్తిచూపుమో
యండజయాన విల్తు"ననఁ । "డాబడివే"లననామె, యోర్తయా
చండికకంటెనీకు సర । సమ్ముగ నిచ్చెద రమ్ము రమ్ము వా
దండలకంచునమ్ముకురు । దండలఁ దత్పురిఁ బుష్పలావికల్.

సీ. మోవిపానక మిచ్చి । ముద్దారఁ గ్రీడించు
నూత్నయౌవనజీవ । రత్న మనుచు
బ్రియవాక్యచతురిమన్ । విటులను వంచింప
యత్నించుఁ బోనాగ । రత్నమనుచుఁ
జనుదోయిఁ జూపించి । కనుదోయిఁ జీకు వా
మాక్షి రా యౌరకా । మాక్షి యనుచు
ధన మిచ్చినంతనె । చనవిచ్చి కడుమెచ్చి
భోగించు రా పద్మ । రాగ మనుచుఁ

గీ. బండువెన్నెల మెండుగ । నిండుకొనిన
వేళ వేశ్యవాటికలందు । విటులుగూడి
మాటలాడుచుఁ బాడుచు । మలయుచుండు
రప్పురము సొంపు వర్ణింప । నలవియగునె?

గీ. అమరభోగినీనిరతసంగమమువలన
నమరవిభుఁడు సహస్రవ్రణాంకితాంగుఁ
డైసహస్రాక్షు విఖ్యాతి నలరునందు
రచటి విటులు రోగగ్రస్తులైన యపుడు.

గీ. పురవనేందిరపచ్ఛకప్పురపుటనఁటి
యాకులను హస్తములఁ జాఁచి నాకమునకు
నందనోద్యానమహిమాభినందనంబు
వలదు వల దంచు వలపులఁ దొలకరించు.

గీ. అన్యభూపాలు రెల్లఱు నభినుతింపఁ
బారు లారోగ్యభాగ్యసంపదలఁ బొదలఁ
మేలుమేలనఁ దత్పుర మేలుచుండుఁ
జంద్రచూడాఖ్యభూపాలచంద్రుఁ డొకఁడు.

గీ. రాజమాత్రుండె? యామసారంగ విపుల
కర్ణపుటమారుతోద్ధూతకాలమేఘ
గర్జనచ్ఛల సన్నుతఘనగుణగణ
రత్నపూరితకాండకరండుఁ డతఁడు.

ఉ. భూతల నాకలోకమని భూజను లెల్లఱు సన్నుతింపఁగా
నాతనిపాలనంబున నిరామయమై పుర ముల్లసిల్ల నా
ప్రేతపురాధిపుండు గని ప్రేతవనం బొనరింపఁబూనెనో
ఘాతుకు నాతతాయి ననఁగా జనెసుందరుఁ డార్జనార్థియై

వ. దుష్టవైద్యశిఖామణి యగు నాహేమసుందరుండు తత్పుర
ముం బ్రవేశించి, యందు నివసించి,

ఉ. తమ్ముఁడుఁదోడుగాఁగఁబిన । తండ్రియు మేలని హెచ్చరింపవై
ద్యమ్మునగొప్పవాఁడనని । దబ్బఱలాడుచు మోసపుచ్చి, వి
త్తమ్ము హరించుచుండె నిజ । ధర్మపథచ్యుతకార్యమంచు చి
త్తమ్మున నెంచఁ డయ్యె నిది । తప్పని చెప్పెడివార లెవ్వరో?

వ. అశ్వినీదేవతావరప్రసాదలబ్ధవైద్యవిద్యాపారగులమనియా
సోదరు లిరువురుంగూడి తత్పురంబున సమీపకుగ్రామం
బుల సంచరించుచు ననేకజనంబుల యమనిశాంతంబున
కతిథులం జేయుచుఁ గ్రమక్రమంబున నెల్లయెడల వా[illegible]
పుణ్యాంబునఁ బామరజన సన్మానంబుఁ బడసి,

ఉ. స్వోదరపోషణార్థమయి । యుచ్చము నీచము నెంచకుండ భా
గ్యోదయలబ్ధికాసపడి । యుత్తమనీతిఁ బరిత్యజించి సంపా
దితఘోరపాపులయి । మందుల మాఁకులవిక్రయించుచున్
సోదరరాజవైద్యు లను । చుం బ్రకటించిరి తత్పురంబునన్.

గీ. సిద్ధమకరధ్వజం బంచు । శుద్ధమైన
పూర్ణచంద్రోదయం బంచుఁ । బుష్పబాణ
పంచబాణ బృహద్ధాతు । వర్ధనాది
రమ్యవాసంత కుసుమాక । రంబు లనుచు.

సీ. శతపుటాభ్రకమంచు । శతపుటవజ్రాభ్ర
కంబంచు హరితాళ । కంబులనుచుఁ

గనకాభ్రకంబంచుఁ । గాంతాభ్రకంబంచు
లోహాభ్రకంబంచు । లోహమనుచుఁ
గాంతలోహంబంచు । ఖడ్గలోహంబంచు
వైక్రాంతమనుచుఁ బ్ర।వాళమనుచు
ముండలోహంబంచు । భూరినాగంబంచు
హేమాక్షికంబంచు । హేమమనుచుఁ

గీ. గాంస్యవజ్రముక్తావంగ। కపరి తామ్ర
శంఖ రజిత కాసీస ర।సంబులనుచు
భస్మనామాళి నానర।ఘుస్మరు లొగి
విక్రయించుచు నార్జించి । రక్రమముగ.

• శ్రీవిష్ణుచక్రంబు । శ్రీకాలకంఠాగ్ని
కాలాగ్నిరుద్రంబు । కాలకూట
మమృతాంశురసము మ।హాజ్వరాంకుశము నా
రాయణాస్త్రము వాత।రాక్షసంబు
బ్రహ్మరంధ్రంబు స।వగ్రాహికఫకేతు
సూతికాభరణంబు । సూర్యరసము
తరుణార్క మత్స్యగ్ర।తరుణార్క మతిసన్ని
పాతభైరవి మహా।వాతహరము

గీ. సన్నిపాత సూర్యావర్తి । చండభాను
వనుచు నానావిధౌషధా।హ్వాయము లెల్ల

గీ. శాస్త్రపరిచయహీనులు శస్త్రపరులు
భక్షితాశేషమానవవ్రాతులైన
మూఢవైద్యుల వైద్యంబు రూఢికెక్క
శ్రాద్ధదేవుండు నేఁడు విశ్రామ మొందె.

సీ. అద్వైతవిద్యారహస్యంబులనెఱుంగ
భ్రాంతి మీకేల వేదాంతులార
కర్కశవాక్కులం దర్కించి బాధలొం
దగనేల తర్కశాస్త్రజ్ఞులార
శ్రోత్రశూలములైన శ్రుతివాక్యములతోడఁ
బనియేమి శ్రోత్రియవర్యులార
అర్థంబులేక శబ్దార్థంబుకొఱ కింత
చింతయేటికిఁ గవిశ్రేష్ఠులార

గీ. గణిత మనిచావనేటికి గణకులార
వ్యాకరణ మేల శాబ్దికప్రవరులార
ధర్మమేటికి ధర్మశాస్త్రజ్ఞులార
ప్రజలవంచించి బ్రదుకుఁడు వైద్యమునను.

గీ. నాడిఁజూచు నెపంబున నారిఁజేరి
పాణిగ్రహియించి భాషింప వచ్చునార
వైద్యమునుమీఱు ననవద్యవిద్య గలదె?
హేమసుందర ధన్యుండ వీవభువిని.

గీ. తొలుత లజ్జాపులకితాంగ।ములస్పృశించి
బాలరండలవలపింప।వచ్చు నౌర
వైద్యమును మీఱు ననవద్య।విద్యగలదె?
హేమసుందర ధన్వ్యండ । పీవ భువిని.

గీ. వారవనితాపరిష్వంగ।వైభవంబు
వైద్యనెపమున సతతంబుఁ । బడయవచ్చు
వైద్యమునుమీఱు ననవద్య।విద్య గలదె?
హేమసు:దర ధన్వ్యండ । పీవ భువిని.

గీ. పుంస్త్వ ముదయించు ననుచు న।పుంసకులను
వంచితులఁజేసి యార్జింప।వచ్చుధనము
వైద్యమును మీఱు ననవద్య।విద్య గలదె?
హేమసుందర ధన్వ్యండ । పీవభువిని.

గీ. సంతతి జనించు ననుచు నౌ।షధములిచ్చి
వంధ్యలను మోసపుచ్చెడి । వైద్యవరుఁడ
వౌర! నీవైద్యనీతి వం।ధ్యాప్రసూతి
హేమసుందర ధన్వ్యండ । పీవ భువిని.

వ. అట్టి యీయాయుర్వేదశిఖామణి యొకనాఁడు,

గీ. ప్రజ్వలించుచుఁగాలు శ।వంబుఁజూచి
చోద్యముంబొంది భళిర! నా।సోదరుండు
లేడు, నేనూరికేగిన।వాఁడ నహహ
యిట్టి హస్తలాఘవవైద్యుఁ । డెవ్వఁ డనుచు.

వ. ఈయంశ మిట్లుండ,

ఉ. బేరముసారముంగల కు। బేరుఁడు వైశ్యకులోద్భవుండు బే
హారులకెల్ల నేలిక మ। హాధనవంతు లవేళలక్షలం
గోరినసత్వరంబె సమ। కూర్చు ఘనుండననొప్పునొక్కఁడా
యూరవసించు వేశ్యలకు। నుండు నెలేమియొకప్పుడేనియున్.

ఉ. ఆతఁడు రాజవైద్యులగృ। హంబునకున్ మకరధ్వజాదివి
ఖ్యాతమహౌషధంబులను। గైకొనవచ్చినయట్లువచ్చి వా
రాలటి నింటలేకునికి। నచ్చటగోపినిజూచి యామె వా
క్చాతురికుల్లసిల్లె సుమ। చాపవిముక్తశరాహతాత్ముఁడై.

గీ. సరససల్లాపచాతురీ। సరణిఁజూపి
వానిహృదయంబుఁ గరగించి। వానితోడ
నొండుదలఁపక పున్నెంబు। పండెననుచు
వెడలె నాగోపి లంజల। విడువదగదె?

చం. తనవల పేవగించి సత। తంబును దొత్తులపొత్తుఁగోరు వా
ధునివలపించి యింటఁదన। తోడుల దూగుచు ధిక్కరించు వా
వనితతనంత నేగృహము। బాసితొలంగినదంచు నెంతయున్
మనమునసంతసించెఁగుల। మానినిసుందరుఁడాగ్రహింపఁగన్.

చ. సతముగృహంబునహృదయశల్యముకైవడిసంచరించుచున్
బతినెడఁబాయకుండు ధన। భామినిపోకకు సంతసించె నా
సతి; పతివెండియున్ ధనమొ। సంగినవేశ్యలభింపకున్నె? దు
ర్మతియగుభర్తఁదిప్పుకొను। మార్గమెఱుంగరుముగ్ధలక్కటా!

కం. కులటతోఁ బెనఁగెనంచుఁ బతి। కొంగుపసిండిగనుండునంచు నా
కులసతి సంతసించె మది। గోరిక లీరిక లెత్త; నక్కటా
వలపురవంత లేని తమ। భర్తల నేలుకొనంగ లేక వే
శ్యల నెరసుల్ గణించి ముద। మందిన భార్యలు జాణలౌదురో.

—॥ హేమసుందరుని మనస్తాపము ॥—

ఉ. "అక్కట దొంగలంజె వల। పంతయు వంతకు వడ్డిగాఁగ నా
దక్కితోఁ బెనఁగె; నేవరుస। దాళెదఁ? దాళెదఁగాక; తాళు నే
తక్కిడుకాఁడు తుంటవిలు। దంటబొజుంగుల నుండనిచ్చునే
యొక్కడ కేగు? నేవిటుని। యుంట మెలంగు నెఱుంగ వచ్చునే?

ఉ. రూకలొసంగ లేక మన। రోసితినో? చెలువారు మేల్ జరీ
కోకలనీయఁజాలనని। కుందితినో కలనైన? నిట్టి పె
ఠోకకు నెట్టి కారణము। బుద్ధికి సుంతయుఁ దోచకుండె; న
ట్టాకుల బెట్టి యేగె నవు। రా వెలచానల విశ్వసింతురే.

సీ. పచ్చపూసాదిగ। హెచ్చుగ వెచ్చించి
కొంపబచ్చుల కెల్లఁ। గుదవపెట్టి
పొంకంబు జనుదోయి। బింకంబుఁ దప్పని
యిల్లాలిసొమ్ములఁ। బెల్లగించి
సద్ధర్మములఁ బాసి। సంచరించుటకుఁగాఁ
జింతించు తండ్రికిఁ। జిచ్చుపెట్టి
నీతికిదూరంబు। జాతి యోర్చునె యంచుఁ
దెలుపు పెద్దలదిట్టి। ధిక్కరించి

గీ. ధనము ధన మంచు నాయనిఁ । దాఁచి యోర్చి
తనకుఁగా ఘోరవిషము నా । యునికొసంగి
తన్ను దేవేరిగా నెంచు । నన్ను తొత్తు
కూతు రెడఁబాసె నక్కటా । కొంపదీసె.

ఉ. ఇచ్చకమాడ నేర్చు విటుఁ । డెవ్వఁడొ మందు నెపాన నింటికిన్
వచ్చి లతాంగిఁ జూచి నయ । వాక్కులఁ జక్కగ మోసపుచ్చి, నీ
యిచ్చకు వచ్చినట్లు ధన । మిచ్చెద మెచ్చెద నంచుఁ జెప్పి తాఁ
జెచ్చెరఁ గొంచుఁ బోయెఁ జెలి । చెక్కులనొక్కి రమింపకుండునే.

ఉ. నమ్మితి నింటఁ బెట్టి గృహ । నాయికఁ జేసితి దాని స్నేహమో
హమ్ముల మందహాస పరి । హాస విలాసములన్ గరంగి రా
రమ్మని మోసపుచ్చె నవు । రా విటుఁ డెవ్వఁడొ? దొంగలంజె నా
నెమ్మదిఁ దలంపకుండఁ జనె; । నేటికిఁ దీరె ఋణానుబంధముల్.

ఉ. చెక్కు చెమర్పకుండ సిరి । చిందులు ద్రొక్కఁడు నింటఁ బెట్టినే
నక్కసగారవించితి; నా । యూరిననుం గికురించి యేగునే?
ఎక్కడికేగెనొక్కొ? యెటు । లీదెద ఘోరవియోగసాగరం
బక్కట! నేడు నాదు గృహ । మంతయుఁ బాడఱె నేమి సేయుదున్.

ఉ. కక్కసమయ్యె నా వలపు; । కానన చంద్రికయయ్యె సొంపు; నే
నెక్కడ దానిఁ జేరుట ది । యెక్కడ? యింతకుఁ దెచ్చె మన్మథుం
డెక్కడ వానినోర్చుట ది । యెక్కడ? వెండియుఁ జిక్కునొక్కొ నా
కెక్కడ? దేవలోకమది । యెక్కడ? హా! విధికంటగించెనే?

ఉ. చక్కనికన్నుఁదోయి, రతి। సంగతికుబ్బుచుఁ గేలుదోయికిన్
చిక్కనిచన్నుదోయి, నును। జెక్కిలిఁజూచినముద్దులూరు కెం
పెక్కినమోవి, మైవిరుపు। లెప్పటికప్పుడె సొంపులీనుఁ గా
నెక్కడఁగానరాదు రమ। యింపుల కింపులునింపు; నక్కటా
యక్కనకాంగిఁ బాయఁగల। నాయిలవాదుశరీరముండఁగన్.

ఉ. పాటలగంధి గోపి నెడఁబాసితి। నార్జితమైన యీధనం
బేటికిఁ? బేటికింక యశ। మేటికి? వీటికి; నిందుజవ్వనం
బేటికి? నేటి కింక బ్రతు। కేటికిఁ? గాటికి; సౌర బోటికిన్
మాటికిమాటికిన్ వెతల గ్రుందెద। గుందెద నేమి సేయుదున్.

సీ. విత్తముఁ దెమ్మని। చిత్తముఁ గొమ్మని
వలపించివలచిన। వలపుకత్తె
ప్రేమించి రమ్మని। కామించి కమ్మని
ముద్దులిచ్చినవాడు। ముద్దుగుమ్మ
మనువిచ్చి బ్రతిమాలి। ననుమెచ్చి రతికేళి
కిచ్చగింపఁగఁ జేయు। మెచ్చులాడి
వగలనల్లనఁజూచి। నగలు ఘల్లనలేచి
యలరించి యలరిన। యలరుఁబోణి
గీ. హావభావంబులకుఁ బేటి। యావధూటి
వలపు బంగరుబొమ్మ సొం। పలరుకొమ్మ
తొంటి నాసాని మానియీ। యొంటిదాని
నేల నెవ్వాఁడుగోరు? నా। కేలపోరు?

వ. ఇట్లు,

మ. వెతలం బెట్టిన దంచు సుందరుఁడు గోపీమోహావాపీరస
న్నతిలోస్నానముఁ జేయుభాగ్యము దిశూన్యంబయ్యె నంచున్నధ
ధృతిహీనుండయి సన్నిపాతజనితార్తిం దూలు రోగింబలె
న్మతిఁ దప్పెన్ గతిఁ దప్పె; దుర్గతియు సంప్రాప్తించు నింతేటికిన్.

వ. మఱియు నామూర్ఖుం డప్పుడప్పుడు నిజకాంతం జూచి ద్వే
వగించుటయుఁగాక తన్నలరింపం జేయు తలంపునఁ గుం
సతి,

సీ. దువ్వెన చేఁబూని । దువ్వుచుండెడు వేళఁ
"గొప్పాడిపడు" నని । జెప్పుచుండు
ముకురంబు చేఁబూని । బొట్టుదిద్దుచునుండఁ
"జక్కనిదానివే । చాలుఁ" ననును
పైఠిణీఱవికెపై । పైటజాఱుటఁ జూచి
"ఊఁ మొత్తుకొన్నట్టు । లున్న" దనును
మురియుచుఁ దనతోన । ముచ్చటింపఁ దలఁప
"నోరున్నదా" యని । నొవ్వనాడు

గీ. సొగసుఁ గన్నులఁ గాటుక । సొగఁదీర్చి
యలరిపం గనుంగొని "లంజ । వ" నుచుఁ దిట్టు
నయ్యతిరుపతిపరపతి । యమ్మయనుచు
మాన్యులు వచించు నార్యోక్తి । మఱచె నేమొ?

వ. ఇట్లనవరతము,

క. కుటిలాత్ముఁడు సుందరుఁ డా
కుటిలాలక నాత్మ నెంచి । కోపించుచు, దు
ర్ఘటుఁ డెవ్వఁడో గొనెనని, యు
త్కటముగ శోకించుచుండెఁ గామాంధుండై.

ఉ. అంతవసంతమింతయు న। నంతసితాంతలతాలతాంతభా
స్వంతము; నంతరీకృత వి। వాహమహోత్సవసంతతారవా
క్రాంతము; కుంతకంఠకల। కంఠవధూకలనాదపూరితా
శాంతమునై విరాజిలె దు। రంతవియోగసతీకృతాంతమై.

వసంతఋతువర్ణనము.

సీ. కరమింపులనునింపు । కరకంకణధ్వనుల్
శారికాపంక్తికిఁ । జదువుసెప్ప
నడయాడువేళ ఝు। ణన్నూపురంబులు
హంసకాంతలఁజీరి । యాదరింప
మేఖలాకింకిణీ । మేదురక్వణముల
నంగుగుణధ్వని । సంగమింపఁ
దాటంకమణిగణ । ధగధగ రోచులు
మందహాసములకు । విందు లొసఁగ

గీ. మాధవుం డేలు నుద్యాన। వీథులందు
సతము వాహ్యాళిసాగించు। సతులవదన
పద్మముల నవలోకింప । భాస్కరుండు
స్యందనంబును బోనిచ్చె । మందగతిని.

గీ. ప్రాతగుజ్జంబులనుమార్చి । నూతనముల
సంఘటింపంగ మదినెంచి । సత్తురంగ
కోటికుత్పత్తిభూమియై । కామరుమిగులం
నుత్తరాశకు వెడలెఁబో । యుష్ణకరుఁడు.

గీ. మంజరీరేణుపింజర । మంజుగాత్ర
పికము, కాకపిహితచూత । వృక్షమునను
కంఠమాధుర్యగరిమ, వ్య । క్తత్వమొందె;
సత్కృతులచేఁ గులీనుని । చందమునను.

గీ. అనలచుంబితకేసరుం । డవనిజాద్వ
తాశయుండు, ప్రసన్నతా । రాధిపుఁడు
విధురరామాతురాపాంగ । వీక్షితుండు
మాధవుండురాజిలె వాను । మంతుఁ డనఁగ.

గీ. పల్లవవ్రాతమగ్నియై । ప్రజ్వలించె
వరపికద్విజమంగళ । ధ్వాను లెసంగె
మందగతివీచెఁ బవనుండు; । మాధవుండు
పుష్పవతియైన వనలక్ష్మిఁ । బొందువేళ.

సీ. సతతంబు నవవిలా । సంబుల శోభిల్లె
వారాంగనం బోలి । ప్రమదవనము
చోరుని చందానఁ । గ్రూరశరంబులఁ
పాంథులఁ బీడించెఁ । బంచశరుఁడు

వనితోపమితలతా । పల్లవవితతిని
శృంగారరసము మూ । ర్తిభవించె
ముగ్ధకాంతాలజ్జఁ । బోలి క్రమంబున
రాత్రిభాగంబు కా । ర్శ్యంబుఁ బొందె
గీ. సరసుఁ డగు మాధవునిఁ గూడు । సమయమునను
వనతలేందిరా కృతగళ । స్వనము లనఁగ
పికశుక ధ్వను లెల్లెడఁ । బిక్కటిల్లెఁ
బలుకశక్యంబె పరికింప । వలయుఁ గాక.
సీ. మలయజ సౌరభం । బులఁ బూని యేతెంచి
నిర్ఝరౌఘంబుల । నెమ్మిఁ గాంచి
అరవింద మకరంద । మిరవొందఁగ వహించి
మదవదళివ్రాత । మద మణంచి
ద్రవిడకాంతాభ్యంత । రంబుల విహరించి
యతుల రతిస్వేద । మపనయించి
ప్రమదావనంబుల । బహుభంగుల రహించి
కుసుమరజంబు ది । క్కులను నించి
ఆ. మంజరీపరీత । కుంజంబు గుంజించి
పుష్పవతుల లతల । పొందు లెంచి
పంచశరుననంగు । బలవంతు నొసరించి
మలయమారుతంబు । మలసె మించి.
వ. తత్సమయంబున,

గీ. ఘనజఘనతన్వి । స్తనభార వినమితాంగి
వికసితాంభోజపత్రాక్షి । విద్రుమోష్ఠి
యనుచు నాగోపిఁ దలఁచి రోమాంచమునను
కుందు హసియించుఁ బ్రలపించు । సుందరుండు.

— ◆ వృద్ధవేశ్య ◆ —

ఉ. ప్రాయముఁ జెప్పనేల విధి । బాల్య మెఱింగిన వృద్ధవేశ్య
రాయణి, యర్థసంగ్రహప । రాయణి మన్మథమంత్రశాస్త్ర
రాయణి యోర్తు తత్పురవ । రంబున రాజిలు వేశ్యవాటిక
బాయక సంచరించు రతి । మల్లవరుల్ కడుఁ దల్లడిల్లఁగ

గీ. జానుపర్యంత లంబిత । స్తనయుగాఢ్య
ద్విపురుష భుజపరిగ్రాహ్య । విపులమధ్య
అతులభేరీనినాదస్మి । తావృతాస్య
విటజనేభ పంచాస్య యా । వృద్ధవేశ్య.

సీ. విటులఁ జూచినవేళ । వెలిపుచ్చు దరహాస
మమవసచీఁకటి । ననుకరింపఁ
దేటతెల్లంబుగఁ । దెల్లబాఱిన బుఱ్ఱ
మ్రుగ్గుఁబోసిన బుట్ట । పొలుపుఁ దెలుప
లొట్టకన్నుల తల । కట్టు సోకన్బొమల్
గొంగళి పురుగుల । రంగు లీన
వెన్ను వంగిచలింప । వ్రేలాడు చన్నుల
నుయ్యాల లని శాలు । రుల్లసింప

గీ. నమ్ములకు మంచి యిమ్మగు । తమ్మలంబు
లొత్తపోయిన బుగ్గలో । నత్తమిల్ల
హేమసుందరు వీక్షింప । నేగుదెంచె
విటజనేభపంచాస్య యా । వృద్ధవేశ్య.

సీ. "అత్త యెచ్చటి కిప్పు । డరుదెంచు చుంటివి
పలుకవా" యని విటుల్ । పలుకరింప
"ధన మిచ్చినం గాని । తలుపుదీయ" దటంచు
ధనహీనవిటులు కొం । దఱు వచింపఁ
"గామింపఁ దగిన యా । కామాక్షికిం దల్లి
యీవృద్ధ" యనికొంద । ఱేవగింపఁ
"గొత్తయల్లుని కొఱ । కత్త వచ్చుచు నున్న
దైయుండు" నని కొంద । ఱపహసింప

గీ. "నింతులకుఁ గాంతులకు మందు । లిచ్చు" ననుచు
ఱంకుటిల్లాండ్రు కొందఱు । ప్రస్తుతింప
నేరికేరీతిఁ బలుక కా । వృద్ధవేశ్య
హేమసుందరుగృహమున । కేగుదెంచె.

ఉ. ఇంచుకయైన జంకక య । నేకజనంబులఁ జంపి యాతఁ డా
ర్జించినవిత్తమున్ గృహము । క్షేత్రముల న్మణిభూషణంబుల
న్గాంచి హరింపఁగా వినుము । కజ్జలతల్లికి మాఱట న్బ్రవే
శించె గృహంబున న్సిరిన । శించక యుండు నెయొక్క వేల్మిడిన్.

సీ. నాడిఁ బరీక్షించి । నయనంబు లెత్తి పై
త్త్యాధికంబుగ నున్న । దనెడువాని
క్షీణించె ధాతువు । శీఘ్రంబుగా స్వర్ణ
భస్మంబుఁ గొండని । పలుకువాని
సకలంక మగుమందు । మకరధ్వజం బని
యత్యధికంబుగ । నమ్మువాని
సుఖసంకటములకు । శుష్కించె మీమేను
మేలుకొం డని చెప్పు । మేలువాని

గీ. మదనకామేశ్వరీలేహ్య । మహిమవలన
సురతమింపొందునని సాక్షి । సోలువాని
బ్రిదుకఁ డాతఁడు పొండని । వదరువాని
హేమసుందరు వీక్షించె । వృద్ధవేశ్య.

వ. తత్సమయంబున వేఱొక్కరుండు వచ్చి హేమసుందరు
జూచి యిట్లనియె.

ఉ. అక్కట! నిన్ను గ్రితను । ణార్క మొసంగితినంచురూకలు
గ్రక్కునసంగ్రహించికుణ । కాలములోగుణమిచ్చునంచుమి
రక్కడనుండి వే వెడలి । నంతనె యేమనవచ్చు...రోగియిం
కెక్కడ? దిక్కులేని ధన । హీనుల నివ్యాధి మోసపుత్తురే.

గీ. ఉన్నరోగంబుస్వల్ప మ । త్యున్నతముగఁ
జేసి వేగబాగా నని । యాసపెట్టి

రకట తుదకు నిట్లయ్యె మీ హస్తములను
ఘల్లుమనినంత వారింట ఘొల్లుమనిరి.

గీ. అనిన విని వాని కున్న తాసనమొసంగి
"యొసఁగఁదగు నౌషధం బాయు వొసఁగఁగలమె?"
యనివచించి భస్త్రాదిలేహ్యముల నొసఁగె
హేమసుందరు నైపుణ్య మెన్నఁదరమె.

వ. ఇట్లెల్లరుఁ బ్రియవాక్యములం దనిపి వీడ్కొల్పి యనంతరము వృద్ధవేశ్యఁ జూచి మందస్మితమండితముఖమండలుం డై నీవువచ్చినకార్యం బే మనిన నామె సవినయంబున మృదుమధురవాగమృతంబు వర్షించుచు నిట్లనియె.

—— వసంతోత్సవాహ్వానము ——

ఉ. కమ్మనికుందనంబనఁగ గ్రాలెడుచక్కఁదనంబుఁగల్గి లో
కమ్మున వైద్యరాజులన నా నుతికెక్కిన మిమ్ముఁజూచు భా
గ్యమ్ము లభింపఁగాంచె నిపు డయ్యది చేకురెనంచు నెంతయున్
నెమ్మది సంతసించెద గణించెద మీసహవాససౌఖ్యముల్.

ఉ. అక్షయమైన సంపదయు నంతకు హెచ్చినవిద్యయున్ సతీ
లక్షితచారులక్షణవిలాసములున్ గల మిమ్మొకాండ్రిక
ధ్యక్షుఁడు సుందరుండు ఘనుఁ డంచు గడుంగడు నాకుమారి కా
మాక్షి వచించుచుండు నపు డప్పుడు నేవిని సంతసించెదన్.

గీ. ఋతువులకు నెల్ల సామంత మీ వసంత
ముత్సవశ్రేష్ఠమగు వసంతోత్సవంబు

జరుపనున్నారు నేఁడు మా । జాతివారు
తమరుసరసులుఁ రాఁ దగు । సమయ మిదియు.

వ. అనినవిని హేమసుందరుం డట్లయగుఁగాక యని యామె
వీడ్కొలిపి యిట్లని వితర్కించె.

ఉ. వంతలపాలొనర్చి, నను । బాసిన యాలలితాంగినెంచినే
నెంతయుఁగుందుచుండఁ దన । యింటికి రమ్మనివృద్ధవేశ్యవా
సంతమహోత్సవంబను మి । షన్ ననుఁగోరినయంతనారవా
స్వాంతముచల్లనయ్యెఁగను । లారఁగఁజూచెదఁగామిఁగామినై.

గీ. విటులు కామించి తుదకు ని । ష్పితముచెడిన
వెఱ్ఱులై మాఱుపేరులఁ । బిలుచుచుందు
రంతమాత్రాన నేమయ్యె । నఖిలజనులఁ
గామియనుపేరఁ గామాక్షి । ఘనతఁగాంచె.

—◆ సంకల్పము ◆—

ఉ. చక్కనిచుక్కయంచు సర । సంబులెఱింగినజాణయంచునా
జక్కవదోయిసొంపు నెక । సక్కెముఁలాడెమచన్నుఁదోయిఁబెం
పెక్కినచానయంచువిటు । లెల్లఱుఁగామినిఁ గామినెంచి న
ల్దిక్కులఁ జాటుచుందురుగ । దే జగదేగమనోహరాంగిఁగా.

చ. వలచితిముద్దులిచ్చిబహు । భంగులనక్కునగారవించి కో
ర్కెలఁదుదిముట్టఁదీర్చి యుల । రించితినింటికిఁ బెద్దఁజేసితిన్
గులసతిరోసితిన్ గడకుఁ । గొంపమునింగినయట్టులిన్నియున్
దలపఁకకాళ్ళఁదన్నకొని । తప్పిచరించునెగోపియక్కటా.

ఉ. ఇక్షుశరాసనవ్యథ సహించిమనంబును నిగ్రహింపఁగా
దక్షుఁడెవండు? గోపితలఁ దన్నులతాంగి లభింపకున్న నా
యక్షయమైన కల్మి కదరా మదిరాక్షి సరోరుహాక్షి కా
మాక్షి లభించె నాదుక యవంతయుఁదీరె విచారమేటికిన్.

ఉ. చిన్నదియందకత్తె యని చెప్పుదు రింతకు నామె తల్లి ర
మ్మన్నది సంశయింపఁదగు నామగవానికి? నాకులోప మే
మున్నది? తృప్తిదీర ధనమున్నది, యాపయిఁ బ్రాయమున్న దే
మున్నది చచ్చినంతఁ దను వుండు నె యీమను వుండునే భువిన్.

గీ. ఆడఁబోవుతీర్థం బెదురైనయట్లు
వెదకఁబోవుతీగియ కాళ్ళఁ బెనఁగినట్లు
తెలమి గామాక్షి వీక్షింపఁదలఁచినంత
నింటి కేతెంచి పిల్చె నీవృద్ధవేశ్య.

ఉ. కోపముఁ జెందుఁగాక జనకుండు కులాంగన కుందుఁగాక యా
క్షేపకులైన మూఢులు డికింతురుగాక కులంబుపోగిన్ మన
స్తాపముఁ జెంది భీయని దినంతులుఁ గొట్టినఁ గొట్టుఁగాక; నే
నీపయి విత్తమిచ్చి భరియించెదఁ గామినిమందగామినిన్.

చ. సరసత లేక దేహమున శక్తిరవంతయు లేక కామినీ
సురతసుఖంబులన్ బడయుచొప్పు నెఱుంగక జాణలైన సుం
దరులవరించి యేలుకొను ధైర్యము లేక వచింతు రక్కటా
పరసతిఁ జూడరాదనుచు వారు నపుంసకులంచు నెంచెదన్.

ఉ. సంపదఁ బ్రాయము న్మతియుఁ జక్కదనంబుఁ గలట్టివాఁడ గా
మింపఁగరాదె? వేశ్యలరమింపఁగరాదె? సుఖింపరాదె? నా
పెంపుసహింపలేని యవివేకులు లోకులు వీరికేమి? లో
గొంపము నింగినట్లు కడుఁగుందెద రన్యులసౌఖ్యవృత్తికిన్.

శా. ఈలోకంబున సౌఖ్యమొందవలెఁ గాకీజన్మ మింకేల వే
శ్యాలోలుండని లోకులందురని నే శంకింతునే? వృద్ధవే
శ్యాలాపంబుల వీనులారవిని నే నాశించితిన్; వేగమా
బాలారత్నముతో రమింపవలదా వైద్యాపదేశంబునన్.

వ. ఇట్లు వితర్కించి వసంతోత్సవంబు సందర్శింపనిశ్చయించి
ధౌతవస్త్రముల నలంకరించుకొని గృహంబుఁ బాసి శీఘ్ర
గమనంబున.

## —♦ వేశ్యవాటిక ♦—

చ. చనిచని చూచె సుందరుఁడు సజ్జనదూషితదంభవాటికన్
వనరుహపత్రివద్ఘటితపంజరబద్ధసుమాస్త్రఘోటికన్
వినయవిలాసవేషయుతవిత్తవధూకులరత్నపేటికన్
జనసుత తేహితత్తహితనాట్యకళాంకిత వేశ్యవాటికన్.

వ. ఇట్లు వేశ్యవాటికం జూచి యందుఁ బ్రవేశించి,

సీ. తనుఁజూచి మొలమి లేఁచినయట్లు నటియించి
యించుకపృథుపృష్ఠ మెత్తుదానిఁ
దనుఁగాంచినంత జార్చినపైట సవరించు
వడువునఁ జనులఁ గేలిడినదానిఁ

దనమోము వీక్షించి । నెనరున్న రావచ్చు
ననుసట్లు లోనికి । నరుగుదానిఁ
దనతోన నించుక । చనవున్న చందాన
దరహాసముం జేసి । ముఱియుదాని

గీ. సుందరుండు వీక్షించి యా।నంద మొంది
వాదిగాక జన్మం బని । నవ్వుకొనుచు
మీసములఁ ద్రిప్పుకొనుచు వి।లాసగతులఁ
జనియె నావసంతోత్సవ।స్థానమునకు

సీ. ధన్వంతరియె వచ్చె । దర్శింపుఁ డని యోర్తు
వాలుఁ జూపులఁ జూచి । వారిఁ దెలుప
రతి యేడ నున్నది । రతినాయకుఁడు వచ్చె
మేలుకొండని యోర్తు । మేలమాడ
నాలోక దేవేంద్రుఁ । డీలోకమున కిప్పు
డేతెంచె నని యోర్తు । యింపు నింప
నలరంభ నెడబాసి । నలకూబరుఁడు వచ్చె
నాశ్చర్యమని యోర్తు । నిశ్చయింప

గీ. నెన్నఁడును రాని వారిప్పు । డేగుదెంచి
రనుచు నోర్తుక సురభిచం।దన మొసంగ
వచ్చిరని వృద్ధవేశ్యయుఁ । బలుకరింప
నతఁడు కూర్చుండె నాసభా।భ్యంతరమున.

చ. జరగెమహోత్సవంబు నర । సప్రిణుతాప్రతిమానగానసు
స్వరనటనానుకూలవర । వారవధూపదనూపురారవ
స్ఫురితవిటప్రవర్తితవ । సుగ్రహాణాగత చేటికాజనో
చ్చరితమహాప్రసాదజయ । శబ్దవిమోహిత నాకలోకమై.

## —♦ వసంతోత్సవము. ♦—

వ. తత్సమయంబునఁ గామాక్షి తన నైపుణ్యముం జూపుతలంపున నాట్యరంగపురోభాగంబున కేతెంచి,

ఉ. కంగులుదీర్చినట్టిఱవి । కన్ జనుఁదోయి యణాఁగకుండ ను
ప్పొంగినయట్లుసిల్చి జిగి । మోవిని చిర్నగవంకురింపమా
ర్దంగికుఁజేరి యాతనిమృ । దంగము పైఁగరమూనినాలుఁజూ
పుంగవపొంతనుండు విట । పుంగవులం గరఁగింపఁజూచుచున్.

సీ. తళతళ త్తళలీను । జలతారుగాగర
పసిడినిగ్గులనింపు । భ్రాంతిఁగొలుప
నెత్తమ్మిపూవుల । క్రొత్తయుత్తమతావి
మెయినుండి దిక్కుల । మేలుకొలుప
ఱవికబిగింపున । ఆపాదకేపారు
చనుఁదోయి పైటలో । గునిసియాడ
విడనాడ కేనాఁడు । వెన్నాడి వ్రేలాడు
కీలుజడంగ్రాలు । పూలుఁరాల
గీ. ఘల్లు మని గజ్జెలందెల । గర్వమణఁచి
తాళమానంబులంగూడి । ధ్వనులనీనఁ

బాటకనుకూలముగనుండు । నాటలాడి
కపటవినయాభినయముల । గరిమఁజూపె.

గీ. భళీభళీబాగుబాగు వహ్వాయటంచు
చాలురా మేలుమేలురా । జాణయనుచు
నౌర యయ్యారె యొయ్యారి । యహానటంచు
సభ్యులెల్లఱుఁబొగడిరి । సంతసమున.

శా. గానప్రక్రియకానుకూల్యమగు నా । కంఠంబు,విన్నాణమౌ
నానాట్యంబుమనోజ్ఞమౌనభినయం । బాతాళ మామేళము
త్యానందంబుఘటింపమైమఱచి నో । హాంభోధి నోలాడుచున్
మానంబూనెను హేమసుందరుఁడుబా । ష్పంబోలిని శ్చేష్టుఁడై.

సీ. పెండ్లాడ నని యింట । బీరంబులాడిన
వాఁ డామెనపుడ పెం । డ్లాడ నెంచె
భార్యఁబాయని యేక । పత్నీవ్రతుం డొక్కఁ
డాజాణమైరేవి । నభిరుచించె
సన్యసింపఁదలంచు । జనుఁ డొక్కఁడామెతోఁ
బెంపొంది పైసన్య । సింప నెంచె
ధనమేటికింక యీ । తనువేటి కీమెఁ గూ
డెదనంచు యొకలోభి । యెదఁదలంచె

గీ. విత్తహీనుండ ననికుందె । విటుఁడొకండు
జవ్వనమణంగెనని యేడ్చె । సరసుఁడొకఁడు

సమయమూహించెభాషింప । జాణఁడోకఁడు
డెందమేమయ్యెనెఱుఁగఁ డాసుందరుండు.

చ. అలరులఁ దేనె లూరినటు । లాధనకామిని పాడినట్టి పా
టలవిని పాడినప్పుడు తడంబడకుండఁగ నాడినట్టి యా
టలఁగనియొక్కజూదరి, యొడందఁగడుంగడు మెచ్చి నేఁడు నే
గెలిచినవిత్తమిచ్చెదసుఖంచెదనంచు విమోహితాత్ముఁడై.

మ. తనపిత్రార్జితవిత్తమున్ సరసుఁడై । ధ్వంసంబుఁగావించి, ని
ర్ధనియై వేశ్యలపొందికన్ దలఁచుచున్ రంజిల్లు దేవాంకుఁడా
ధనకాంతామణియాటపాటలకెడందన్ మెచ్చిచింతించె, ఛీ
జననంబేటికిఁ బేదనై తిననుచున్ । సంభోగవాంఛామతిన్.

చం. పసచెడిపేదయైనయొక వైశ్యవరుం డపుడామెఁజూచి సం
తసమునమెచ్చి నారి! తట్తప్పెగదా యిపుడేమియున్న దీ
యొసపరిసానినేఁబ్రిదికియుండినయప్పుడు చిక్కియున్న నా
మసకమెనంగఁగూడికల మాన్య మొసంగ నెయంచు నెమ్మదిన్.

వ. అత్తరి నాహేమసుందరుండును వ్యామోహితాత్ముండై
యమందానందంబు డెందంబునం గ్రిందుకొన నమ్మంద
యానంజూచి,

మ. భళిరాయియ్యదినాట్యరంగమె? నవ స్వర్గంబయాగాకయీ
యలరుంబోణియమర్త్యకాంతయగునే యారంభయాగాకకో
యిలయొక్కింత్రచుకకూయఁగాక గలదే యీపాటయీయాట; నే
గలిమింగాంచినదానికిన్ఫలముగా గామాక్షిఁ గామించెదన్.

వ. అని యిట్లతం డూహించి, యమ్మహోత్సవానంతరమునఁ
గామాక్షి నివసించు గృహంబున కేగినంత, లోనుండి
యావృద్ధవేశ్య వీక్షించి, తనకుమారిం బిల్చి,

ఉ. ఎన్నఁడురానియీసరసు లిప్పుడు వచ్చిరి, రూపుఁదాల్చి సం
పన్నిధి వచ్చె; నీగృహము పావనమయ్యెను చూడవేని నీ
కన్నుల పండువయ్యె నని కమ్రవచోవిభవాభిరామమై
మున్నెదురేగి రంగుగృహముంగనుఁడంచును దెచ్చె లోనికిన్.

ఉ. రండని యాదరించి పలు రంగులఁగ్రాలెడు పీఠమందుఁ గూ
ర్చుండగ నిచ్చి, పైవినయ ముట్టిపడన్ దమ రీపురంబునం
దుండియు మానివేశ మెటు లుండెనొ చూడరు వైద్యవిద్యలో
బండినవారు, ఖ్యాతిఁగల పండితు లీముది లంజెఁజూతురే.

చం. అనవుడు సుందరుండు దరహాసము మీసములో రహింప ని
ట్లని యెను; రాక యుండఁగల నా? యుపుడప్పుడు రాఁదలంచుచుం
దును సమయంబు చిక్కదు; జనుల్ నను బాయక యౌషధంబుల
న్గొనిచనుచుందు రెట్టులోన గూడును కాలము మిమ్ముఁ జూడగన్.

చం. పురిఁగల పేదసాదలను బ్రోచుటకై మనయూరిరాజుగా
రిరువదివేలరూప్యముల నిచ్చిరి మందుల కంచు నందుచేఁ
బరులను జూడఁగన్ గృహముఁ బాయఁగఁగాలము చిక్కకుండె
ప్పరసున నైన రాఁదలఁచి వచ్చితి మీసభఁ జూచి మెచ్చితిన్.

— సుందరుని వికత్థనము. —

సీ. వైద్యుల మెప్పించి । వైద్యనాథఖ్యాతిఁ
దేజరిల్లితి వంగ । దేశమునను
వరపండితులమించి । వాదించి యోడించి
దీపించితిని యోధ్య । దేశమునను
ధన్వంతరియనంగ । నన్వర్థమగునట్లు
తారాట్ప్రాణముగనుంటి । దక్షిణమున
వైద్యరాజఖ్యాతి । బహుమానములఁబొంది
సంచరించితిరాజ । సభలయందు

గీ. దృష్టిదీటుంగ విత్తమా । ర్జించినాఁడ
వేలకొలదిగ వెచ్చింపఁ । జాలినాఁడ
వైద్యులకు సద్యశంబు శా । శ్వతధనంబు
దానికిఁగళంక మొదవిన । హానివచ్చు.

గీ. వైద్యులకు జారవృత్తి స్వా । భావ మగుట
నించుకంతలోపంబు వీ । క్షించిరేని
కింవదంతులఁ బుట్టించి । కేరుచుండు
లోకులను నమ్మవచ్చునే । కాకులరయ.

పరదూషణము.

గీ. అనుపూర్విగ రాజవై । ద్యవరులనఁగ
ఘనతకెక్కిన వారింట । జననమొంది

యుంట నధికవిఖ్యాతితో । నొప్పుచుండె
జారుఁడయ్యును మాధవా। చారియొకఁడు.

ఉ. జారుఁడు దుష్టవర్తనుఁడు । సజ్జనదూషితుఁడైనమాధవా
చారి కొసంగెభూపతిభి।షజ్మణి యన్ బిరుదంబునిప్పురిన్
బౌరులు గౌరవించెదరు । వైద్యమెఱుంగఁడౌటింగినట్లు సం
చారముఁజేయుచుండుజన।సమ్మతి మొందినకారణంబునన్

ఉ. ఆతనివృత్తివేశ్యలగృ।హంబులయం దభివృద్ధిఁగాంచె; వా
క్చాతురిఁజూపు; నౌషధ మొ।సంగఁగఁజేవయు లేదు దంభవి
ఖ్యాతినిఁబట్టి వైద్యవరుఁ।డంచునుతింతురు పౌరు లింతకున్
హేతువు వేషధారియతఁ। డెన్నఁడుజూడఁడు వైద్యశాస్త్రమున్.

ఉ. పేదలనుండివిత్తము ల।భింపకయుండుట యట్టులుండె; నే
మాదిరివారలైన నొక।మా రతనింగని పిల్చినంతనే
యేదియొయిచ్చివచ్చు ధన।మేమియుఁగోరఁడు వైద్యరాజమ
ర్యాదనశించె నీపురము।నందున నాతనికారణంబునన్.

గీ. అందుచేఁ జూవె నే నప।ఖ్యాతియునిన
నధికముగభీతిఁబొంది గృ।హంబుఁబాయ
ననుచు శ్రీరంగసీతుల।నాడుచుండ
వానివీక్షించి యావృద్ధ । పలికెనిట్లు.

శా. మీ రేలిట్లువిచారమొందినమదిన్। మేమెట్లుదుఃఖింతుమో
వారస్త్రీలిపుడెందతెందఱని నే।భాషింతు లెక్కింతు కేనం

పారస్త్రీలని వారకాంతలనియున్ । శక్యంబె భేదింప? సం
కేరీతిన్ బ్రదుకంగవచ్చు నకటా! యేమందునిక్కాలమున్.

—♦ జారస్త్రీ దూషణము ♦—

సీ. విటులనువంచించి । పెద్దమేడంగట్టె
నద్దమిూటి చరించు । నొడ్డెముండ
మన్నింపఁదగినట్లు । మన్నెంబులార్జించె
బహువేషములఁదాల్చి । బలిజలంజె
ఈడిగిలంబము । వేడుక కాండ్రకు
వగలాడియయ్యె సీ।డిగలమగువ
అది యదృష్టంబేమొ । యందజితలఁదన్నె
నిపుడు దూదేకుల । యెమ్మెలాడి
గీ. నాగరత్నాది నూతన । నామములను
బెట్టుకొని వీరలిప్పుడు । పెద్దలైరి
సానులావీరు మాకు స్నే।తానులైరి
సంకరంబయ్యె మాజాతి । స్వచ్ఛమయ్యె.
మ. వెడఁగులఁజూచివీరువల।పించెదరయ్యదియట్టులుండె నె
న్నఁడువినమిట్టివింతఁదమ।నాధులకన్నులదుమ్ముఁగొట్టిమా
పడపుఁ బడంతులేద్చుటకు। బాఁపనసానులు లేచిరింక మా
కడుపులునిండవచ్చునె జ।గన్నుతకీర్తి ఘృణీభిషఙ్మణీ.
సీ. కోమటిజగ్గయ్యఁ । గొంపముంచినట్లు,
జోగిఁగావించె ని। యోగిభామ

మగవాండ్రి కియ్యది । తగునె భర్తం బాసి
స్వైరిణియయ్యె వ్యా । పారినారి
రానివానిదెశప్పు । రతులను మెప్పింపఁ
జాలినజాణ వై । ష్ణవ వధూటి
వాలుఁజూపులఁజూచి । వలపించుఁ గుసుమాస్త్రి
ఘోటిఁబోలిన వెల । నాఁటిజోటి

గీ. అతులబలులను పదిమంది । నైననోర్చు
సాటిలేపట్టి కాసల । నాఁటిబోఁటి
విటులగర్వం బణంచు దా । విడులపడుచు
సాను లమితక్షుధావ్యథా । గ్లానులైరి.

మ. తొలుతన్దానొకలంజయైవిటులసా । త్తున్దోఁచుటట్లుండెఁగూఁ
తులనల్లుండ్రనుజేరనీయక జనుల్ । దూషింపఁగా నక్కటా
కులటావృత్తికి హెచ్చరించి ధనముం । గొల్లాడు నేవేళ మా
యలమర్మంబులఁబన్నుచుండుఁదగునే । యావీధియమ్మన్నకున్.

గీ. బాఁపనమ్మలు కొంద ఱీ । పట్టణమునఁ
బగలు సంసారిణులఁబోలి । పలుకుచుండ్రి
సానులంబోలి రాత్రిల । సంచరింతు
రేమనఁగవచ్చు మాయోగ । మిట్టులుండెఁ?

సీ. పగలుముసుగూని । పరవితంతువుమీాఁదఁ
గామినియై రాత్రి । గణముఁగోరుఁ

బగలు శుద్ధవిభూతి । ఫాలంబునందీర్చు
రాతిరి ఘనసార । భూతిఁ బేర్చుఁ
బగలు రుద్రాక్షకంబు । లగణితంబుగఁ దాల్చు
వలపూర రాత్రి స । రుల్కలనుబొల్చుఁ
బగలు చక్కనిజరీ । బట్టలం గడుఁదిట్టు
రాతిరి నట్టివ । స్త్రములఁగట్టుఁ

గీ. బగలు జారిణులంజూచి । పరిహసించు
సరసనల్లాపముల రాత్రి । సంచరించు
విటులవంచించు నీరీతి । విధవయోర్తు
ఎల్లిదంబయ్యె మాావృత్తి । యెట్టు లోర్తు.

గీ. ఎండకేయెండ నెన్నఁడు । నెఱుఁగనట్టి
సతులఁ గూడనంతఃపుర । సౌధములకు
విటులు స్త్రీవేషధారులై । వెడలుచుందు
రాఁకు వ్యతిరేకముగనుండు । మన్మథుండు.

వ. అనిన విని యక్కపట వైద్యుండు,

చ. సరిసరిచెప్పకేమి వ్యభి । చారగుణం బిల నన్నిజాతులం
దిరవుగ నాటుకొన్నయది । యెవ్వరెఱుంగరు దానికేమి
వరసుతనేలుఁ బ్రాపకుఁ డొ । వండనినంతనె సొంపునింపుచు
గరితయనంగఁ గామివిని । గ్రక్కున నాదలవం చెనత్తఱి
వృద్ధవేశ్య యిట్లనియె.

గీ. వినుఁడు మీనాక్షి కామాక్షి । యనెడుకూఁతు
లిరువురున్నారు చిన్నది । యీలతాంగి
అకట! మీనాక్షి పెద్దది । యామెయిప్పుడు
కందువాఱె లూతారోగ । కారణమున

గీ. నీతియుఁ ఖ్యాతియుఁ లేని । జాతులందు
నరయ మాజాతి యతిహీన । మయ్యె నకట
ధనము ముఖ్యంబుగా నెంచు । వనిత కింక
ప్రాపకుల కేమిలోపంబు । వైద్యరాజ.

ఉ. మన్నములన్ సువర్ణ బహు । మానములన్ రతనాల పేరులన్
గ్రన్నన నెన్నియైన నొక । రాత్రికిఁ బూటకునొక్క మాటకున్
కన్నకు నిత్తు మంచు విట । కాండు వదించుచుఁ బోవుచుందు రీ
కన్నులఁ జన్నులన్ గరయు । గంబున ముట్టి వచింతునొట్టుగా.

మ. ధనమా! పావన మింతకున్ దగిన వి । ద్వద్వంద్యు నేగాని యు
న్యనివీక్షింపను మాటలాడ ననుచు । న్గార్చుండెఁ గామాక్షి యా
నని కానిమ్మని మిన్నకుంటి నెవఁడ । య్యాయట్టి వాఁ డొక్కసిం
గన నానే? మిముఁ బోలువారు గలరే । తొమ్మండలిం జెప్పుఁడీ

సీ. అనవద్యహృద్యగ । ద్యాది పద్యాన్విత
భవ్యకావ్యంబులం । బలుకఁగలదు
గండుఁగోయిలమూఁక । దండెత్తి నట్టుల
సరససంగీతంబు । జరుపఁగలదు

కలవాణి యగువాణి । వలపించుచందాన
నింపుగా వీణవా । యింపఁగలదు
ప్రాణ మున్నట్టుల । రంగులసొంపు ర
హింపఁ జిత్రములఁ జి । త్రింపఁగలదు

గీ. లాస్యమున నీమెఁ బోలు చం । ద్రాస్య లేదు
మీరు వీక్షింపలేదె క । న్నార నేఁడు?
చెప్పుటకు సిగ్గుగానుండు । సృష్టియందు
సుదతిఁ బోలింపఁగా నర । సుండు లేఁడు.

వ. అని వచియించి, కామాక్షిం జూచి, మఱియు నావృద్ధవేశ్య యిట్లనియె.

ఉ. గోలవుగాక నీవు వెల । కోమలివే? నెఱజాణ వౌదువే?
చాలును చాలు మెచ్చఁదగు । సానివిఁ కమ్మని కప్పురంపుఁదాం
బూల మొసంగవేమి? చనవుంగొని యించుకపల్కవేమి? నీ
లీలలఁ జూచి వారలు బ । ళేయని మెత్తురె? చిత్తమెత్తురే.

వ. అనిన విని యక్కామాక్షి.

చ. వలపిగురొత్తసుందరుని । వాలికచూపులఁ జూచి యేమియుం
బలుకక వక్కలన్ సురభి । వస్తుచయంబును సంగ్రహించి లో
నలరుచు నెండిపళ్ళెరము । నందిడి పైఁ దెలనాకు లేర్చుచున్
జిలుకలఁ జుట్టుచుండె దన । వేరుపుఁ గూరుపు విస్తరిల్లఁగన్.

వ. అట్లు చిలుకలం జుట్టుచు నానెఱజాణ,

ఉ. సొత్తుహరింపగా సొగసు జూపుల రెప్పల నప్పళించుచున్
చిత్తముపల్లవింప విటశేఖరు మెల్లగఁ జూచినవ్వు; ను
న్మత్తతమోవి నొక్కుఁ బలుఁ నాటగ విత్తమొసంగినంత మో
మొత్తెదు లంజె కిన్నివగ లేటికి? మూఢుఁ డెఱుంగఁ జాలునే.

వ. తత్సమయంబున హేమసుందరుండు వృద్ధవేశ్య కిట్లనియె.

చ. స్థిరముగ నొక్కవాక్యము వచించెద మానసమునిండినంత నే
యిరువదియైదురూప్యముల నిచ్చెద; నాపయి నప్పుడప్పు డా
భరణములిచ్చువాఁడఁ గఱవా తెఱవా గల యాస్తియంతయున్
గరమనురక్తినిత్తు నను గాదని యన్యునిఁ జేరకుండినన్.

వ. అనిన విని వృద్ధవేశ్య యిట్లనియె;

ఉ. పొచ్చెము లేని మీ వలపు పొల్లగునే? దయ నేలుకొందు మీ
మెచ్చులకున్న దేవిలువ మీకును మాకును బేరమున్నదే?
ఇచ్చకువచ్చెనేని ధనమిత్తురు భూముల నిత్తు రింతకే
మిచ్చిననిచ్చువారె తమ యెన్నికకెక్కిన ప్రాణకాంతలున్.

సీ. పదివేలు రాబడి వచ్చుమాన్యము లిచ్చె
సరసీరుహాక్షికి శంకరుండు
ఒడలు నిండఁ బసిండి తొడవుల నిడలేదె
జీవరత్నమునకుఁ జిన్నసెట్టి
ఒక్కరాత్రికిఁ గాదె యొక్కగ్రామం బిచ్చె
మధురవాణికి నాఁడు మాధవుండు

మిన్నందుకొనుగొప్ప। మేడఁగట్టింపఁడే
కృష్ణవేణికి జెమ్మి। కృష్ణమూర్తి

గీ. వలపులిగురొత్త ముద్దుల। వలపుకాండు
ప్రాణకాంతల కేమియు। రాదు చెపుడి?
మెచ్చులిచ్చి యేమిచ్చిన। నిచ్చువారె
వలపులకు వేఁడుకలకింక। విలువగలదె.

చ. అరువదియేండ్లు పైఁబడియె। నంతకుఁడుందఱిచూచుచుండెఁ; నే
నిరువదియేండ్లదానను। యేపుగనుందు నె? కల్మియేటి కీ
సరసిజనేత్ర మీకిపుడొ। సంగితి నెవ్విధి నేలుకొందురో [రల్.
యెఱుఁగరె వైద్యనాథులు। రేంగికమున్ గ్రహియించు నేర్ప

ఉ. మీరలయున్నఁజాలునని। మేనములో సురరాజ్యమబ్బునే
పైదలిమీపదాబ్జములఁ। బాయకయుండినలోపమున్నె? నా
కేదిసుఖంపగాసమయ। మెక్కడనుండిలభించుఁ? గల్మిఁగొం
పోదునె? యక్కటా ముసలి। ముండను కాటికిఁగాళ్ళుచాచితిన్

ఉ. కోటిమొనర్చు మీసుగుణ। కోటియెదిక్కని యూర్పు యించుచునీ
బోఁటియదృష్టమెట్టిదియొ। బుద్ధిగ్రహింపఁగనౌనె? యింతకున్
గూటికిగుడ్డకున్ మఱియుఁ। గొంపకు లోపముసంభవింప దే
నాఁటికి నిశ్చయంబు విటు। నాయకధిక్కృతవిత్తనాయకా.

గీ. నికరమైన ముహూర్తంబు। నిశ్చయించి
కన్నెఱికమును బాపి యీ। కన్నెమిన్న

నేలుకొండు దాని యదృష్ట । మెట్టులుండు
నట్లయగుఁగాక చింతింప । నన్యమగునె ?.

వ. ఇట్లావృద్ధవేశ్య భాషించు నవసరంబున,

సీ. కెంపులరవలతో । సొంపారుకమ్మలు
చెక్కులకొకవింత । చెలువమొసఁగఁ
దాంబూలమునఁగొంత । డంబుమీఱినమోవి
మందహాసంబున । నందమొంద
వగలచే నగలచే । వలపించునెమ్మేన
వలిపంపుజలతారు । వలువగ్రాల
గబ్బిగుబ్బలయుబ్బు । నిబ్బరంబణఁచిన
పైఠిణీఅవికెపైఁ । బైటజార

గీ. బెళుకుకొనునజాళువా । తళుకుకు లొలుకఁ
గరయుగంబున వెండిప । ళ్ళెరముఁబూని
యందియలమ్రోఁత వింపొందు । మందగతిని
యల్లనల్లనఁదరిజేరి । యామిటారి

గీ. లేనిలజ్జ నటించుచు । లేనిగీవి
వగలఁజూపుచు నందిచ్చెఁ । బళ్ళెరంబు
నైదుకాసులఁ బడవైచి । యావిటుండు
వీడియంబును గైకొనెఁ । బెంపలర్ప.

వ. అట్లతండు వీడియంబుఁగైకొని వృద్ధవేశ్యంజూచి, నీవని
నట్లు తగినముహూర్తంబు నిశ్చయించెద; తన్ముహూర్త

వేళ నీకుమారిం గనకాభరణాలంకృతంజేసి నూటపది యారులం గానుకగా నొసంగెద, మిగిలిన మర్యాదలం గూర్చి నీకుంజెప్పఁగా నేటికని లేచి నిలువ నావృద్ధవేశ్య యిట్లనియె.

శా. చేతో జాతునిధిక్కరించుచజిగితోఁ జెల్వొందుమీమేను;మీ చేతన్మాతురితె ? కామినేలఁగలవారీమాటయిట్లుండఁగా లూతారోగనివారణార్థమయి యిల్లున్ గుల్లఁగావించితిన్ మీతోఁజెప్పకతప్పునేయకటమా మీనాక్షిఁగాపాడుఁడీ.

చ. అనవుడుసుందరుండువివిధౌషధముల్ గలవెన్నియైననుం గొనఁదగునిట్టి రోగములఁగోటికి హెచ్చుగబాగుజేసితిగా ధనికులుభూమినాయకులునావరవైద్యమునెన్నుచుందురే నసయమువేయినూటపదియారులఁగైకొనువైద్యనాథుడన్

వ. అని వచించి హేమసుందరుండు తద్గృహంబుఁబాసిచనియె అనంతర మావేశ్యమాత కామాక్షింజూచి యిట్లనియె.

చ.ఇదివఱ కెందఱెందఱినియివ్విధి బూమెల మోసపుచ్చినం పదలహరించియుండము;ధుర్యవంబనియాతఁడువిశ్వసించె నీ వదనముఁజూచి నీనటనవైభవముంగనిసొక్కిసోలిలో నదవదఁజెందెమోహసముద్రగతి; నేమనవచ్చుఁగామునిన్

—♦ వృద్ధవేశ్య ప్రగల్భములు. ♦—

ఉ. చెప్పెదనొక్కమాట విటశేఖరులంగరఁగించునేరుపుం

గుప్పలుగాఁగడింపవలెఁ గూరిమిఁ జేరిమిఁ జూపియెమ్మెలన్
జప్పన వీనిలోఁబఱచి సంపదలన్ హరియింపఁగావలెన్.

గీ. తాళిగట్టినమగఁడఁటే తలిరుఁబోఁణి
వీనితలఁదన్ను సరసులు వేనవేలు
ఇతనివిత్త మేపాటియో మతినెఱింగి
సాగనంపుము వేగమే స్వస్తిజెప్పి.

చ. ఒకనికి ముద్దులిచ్చి, మఱియొక్కనితో సరసంబులాడి, వే
ఱొకనిని కౌఁగిలించి,మఱియొక్కని రమ్మని కన్నుగీటియొం
కొకనికి స్వస్తిఁజెప్పి మఱియొక్కనితో రతికేళిఁదేలి ప్రా
పకుని వరుండఁబెట్టఁగల వారలతాంగికి లోపముండునే.

ఆ. ఆటవెలందికిం దగినయందముఁ జందము లేక యుండినన్
బైటకుజార్చు నేర్పు, చనుబాతులఁ జూపియుఁ జూపనట్టి సఁ
య్యాటలుమందహాసపరిహాసములున్ నువుఁబువ్వుఁదేనెఁబో
ల్మాటలుఁచాలుమాపుటకు మంటులు మాకులు పెక్కులేటికిన్.

ఉ. ఎమ్మెలు బూమెలుంగల వనేకములయ్యివి కానరానిమేల్
సొమ్ములు వారకాంతకుఁ బ్రసూనశరుండు లభింపఁజేసె, నీ
వెమ్మెయి వీనివిత్తముగ్రహించి రహింపుముసాగనంపు మో
యమ్మరొ యౌవనంబుమన యాస్తిగనమ్ముము నెమ్మనంబునన్.

గీ. యౌవనం బున్నయప్పుడె యఖిల విటుల
ప్రాపకముఁ బొంది యార్జింపవలయు ధనము

యౌవనము లేని జీవన । మౌవనంబు
గణిక యొకనితోఁ జేయునే । కాపురంబు.

సీ. వాలుమీలం బోలు । వాలికచూపులఁ
గవినంత నొక్కండు । కడు రహించుఁ
బండు వెన్నెలనిండ । మెండుఁగ బకపక
నవ్వినంత నొకండు । ననుపుఁబొందు
ఝుణఝుణన్నూపుర । స్వనము లింపొందఁగఁ
దన్నినంత నొకండు । తనివిఁజెందుఁ
దాంబూలరాగంబు । డంబారనవ్వుచు
నుమిసినంత నొకండు । బ్రిమసిపడును

గీ. సరసగోష్ఠికి నొక్కండు । సంతసించు
మట్టినన్ బాడినన్ జేరి । మూరుకొనినఁ
గసరినన్ గౌఁగిలించిన । నెనఁగుచుండు
నొక్కఁ డొక్కఁడో చక్కని । చుక్కవింతె
భేదమున్నదె? విటులకు । విటపులకును.

సీ. సోమసుందరుఁ గోరి । కామించి ప్రేమించి
జోగిఁ గావించితి । సుందరాంగి
వాడు స్థానాచార్యు । నాచాయకుం ద్రిప్పి
కొంపనమ్మించితిఁ । గోమలాంగి

విశ్వనాథుని మెచ్చి । విశ్వసింపఁగఁ జేసి
చేతి కిచ్చితిఁ జిప్పఁ । జిగురుబోణి
పద్మనాభున కంక । బాంధవంబును గూర్చి
యిల్లు గట్టించితి । నిందువదన

గీ. ఆవిలాసంబు లారంగు । లాహారంగు
లాసొబగు లాహంగులా । యాబెడంగు
లహహ యావన్నెలా చిన్నె । లనుపమాంగి
తలఁచుకొన్న నిప్పుడుఁ బుల । కలుజనించు.

వ. నాయనుభవం బెంతయని చెప్పఁ గలదాన, విటులు వచ్చు వేళయయ్యె భుజించి సిద్ధంబుగ నుండుమని యావృద్ధ వేశ్య కామాక్షితో లోసకరిగె అనంతరమున.

ఆశ్వాసాంతము.

మ. హరకోదండవిఖండనా!యతులశౌ । ర్యౌదార్యధీమండనా!
శరపుంఖాంకితకుండలా!నిజయశ । స్సంఛన్నభూమండలా!
వరభక్తాంబుజభాస్కరా!సురనుత । బ్రహ్మర్షిహృత్తస్కరా!
అరిభూనాయకలోకశిక్షక! యహ । ల్యాదేహసంరక్షకా!

మాలిని. మదవదరికులాంతా । మన్మసుతాపాపినకాంతా
కదనతలకృతాంతా । క్షితిభూరుద్వసంతా

పదగమితవనాంతా । భక్తకేళీనిశాంతా
విదితసుగుణవంతా । విస్ఫురత్కీర్తికాంతా.

గద్య. ఇది శ్రీరామచంద్రకరుణాకటాక్ష ప్రసా
దిత సత్కవితాలతా ప్రసూనాయమాన
నవీన ప్రబంధంబైన హేమసుంద
రోపాఖ్యాన గ్రంథంబునం
దుత్తరోదంతమను
ద్వితీయాశ్వాసము.



శ్రీరామచంద్రాయనమః

శుభమస్తు — అవిఘ్నమస్తు




# తృతీయాశ్వాసము.



క. శ్రీమానినీకుచద్వయ
సీమా! కాశ్మీరపంక । చిహ్నితవక్షా!
కామాదివర్గశిక్షా!
భీమాహవకార్యదక్ష! । పృథివీరక్షా!

గీ. అవధరింపుము నీవు నా । మాంకితముగ
నొప్పిదంబుగ నిప్పుడు । చెప్పఁబోవు
నవసుధారసమిళితసూ । నమకరంద
బిందుసందోహమైన న । వీనగాథ.

గీ. అఖలపామరజన వంచ । నావగుణ ధు
రంధరుండగు నా హేమ । సుందరుండు

సత్వరంబ సువర్ణంబు । సంగ్రహించి
స్వర్ణకారున కిచ్చె నా । భరణవిధికి.

వ. అట్లతం డాభరణనిమిత్తము కొన్నిదినంబులుగడపి యొకి నాఁ డేకాంతమునఁ గూర్చుండి నిజకార్యముంగూర్చి చింతించుచుండు నవసరంబున,

గీ. స్వస్తి; ధనసిద్ధిరస్తు, దీ । ర్ఘాయురస్తు
మంగళానిభవంతు తే । మానినీ వ
శీకరణతంత్రియనుచు నా । శీర్వదించి
వచ్చికూర్చుండె బ్రాహ్మణ । వరుఁ డొకండు.

వ. వచ్చినవానిఁ జూచి యాహేమసుందరుం డిట్లనియె;

గీ. ఇంతకాలంబు ననుఁ బాసి । చింతఁదక్కి
దివ్యపుణ్యస్థలంబులఁ । దిరిగితిరిగి
వచ్చినాఁడవు నినుఁజూచి । మెచ్చినాఁడ
మఱచితే నాదుస్నేహంబు । మాసు రేంద్ర.

క. అనవుడు వానిఁజూచిహృద । యంబుననించుకసంతసించి, నీ
వెనరునఁగాదెయావ్యజన । నిశ్చితపుణ్యానదీనదంబులన్
ఘనులమహామునీంద్రుల జ । గన్నుతదేవతలన్ బురంబులన్
గనుఁగొనినాఁడ నీసదుప । కారము నెమ్మది విస్మరింతునే?

గీ. సఖ్యమును విస్మరింపఁగ । శక్యమగునె?
అరయ సఖ్యంబునకు దూర । మనఁగఁగలదె?

బర్హిమేఘంబులును, పద్మ। భాస్కరులును
కుముదచంద్రులుమనకు సాక్షులుగనుండు.

వ. అని యిట్లాభూసురుండు వచింప నౌనని తలయూచి యాహేమసుందరుం డిట్లనియె;

గీ. సరససంగీతసాహిత్య। సరణిఁజూడ
సానులందునుగలదు ని। శ్చయము సఖుఁడ
నీవు వీక్షింపవైతూర। లేవుగనుక;
వరవసంతోత్సవం బొండు। జరగెనిచట.

గీ. నాఁడుకామాక్షి యనువార। సారసాక్షి
యాటపాటల నలరించె। నఖిలవిటుల
హావిలాసంబు లాహావ। భావములు
చూడవలెఁగాక చెప్పిన। సొగసుచెడదె.

గీ. అహహ కామాక్షి వదనశ। శాంకలక్ష్మి
అతులమణినూపురారావ। జితమరాళ
అధరనిర్జితబంధూక; । పాణిసఖుఁడ
యామెశారదాగమంబన। నతిశయిల్లు.

గీ. చక్కఁదన మిట్టిదని చెప్ప। శక్యమగునె?
అహహ! సౌందర్యలక్ష్మికి। నాలతాంగి
తిలకమగుఁగాక; యారతీ। దేహమునకు
కాంచనాభరణం బగుఁ। గాక సఖుఁడ.

గీ. ఎలమినానాఁడు దానింటి । కేగియుంటిఁ
జెప్పవచ్చునే? నీతోడఁ । జెప్పకేమి?
వలచివలపించిపలుకుల । నలరఁజేసె
వలపు బంగరుబొమ్మ యా । యలరుఁగొమ్మ.

గీ. విగ్రహించితిఁ జూచె నీ । యింగితంబు
నెనెఱుంగనిసాను లెం । దైనఁగలరె?
వలపులేదనుపలుకు ధ్రువంబయగును
మోదుగుంబూవులకును రో । పొలఁతులకును.

చం. రసికజనావతంస! మక । రధ్వజశాస్త్రరహస్యవేదివే
యొసపరిలాడినిన్నుఁగని । యువ్విళులూరకయూరకుండునిం
పెసఁగవచించువాఁడ నతి । హీనసుఖానుభవప్రసక్తి; నేఁ
బనచెడిపేదనైతిఁగద । వారవధూపరిరంభకామినై.

## —♦ హితోపదేశము. ♦—

గీ. వారవనితాపరిష్వంగ । వైభవంబు
స్వర్గమనియెంచి కామినై । సంచరించి
చిత్తమిగురొత్త నకట వె । చ్చించినాఁడ
నూర్జితంబైన యమిత పి । తార్జితంబు.

చ. తలఁచినయంత నేయమిత । తాపముఁగూర్చునుచూచినంత నే
మొలమినిమోసపుచ్చి మతి । హీనునిఁజేయును తాకినంత నే
వలపులఁగుల్కి మోహమను । వారిధిలోఁబడవైచునక్కటా
కులటలతపించుఁగాక కుల । కోమలిఁబోలునె? హేమసుందరా!

చం. వదరుదురొక్కవేళ, వలవంతకుఁ జిక్కి కృశించినట్లు కుం
దుదురొకవేళ, నమ్మకముఁ దోఁపనటించుదురొక్కవేళ, న
వ్వుదురొకవేళ, లేనివలపుం బ్రకటించుదురొక్కవేళ, సం
పదలహరింప; భోగినులమాయలెఱుంగఁ దఱంబె యేరికిన్

గీ. వారకామినిమన్మథవహ్నికీల
కపటరూపేంధనంబునఁ గాలుచుండు
విటులు యౌవనధనముల వేల్చి వేల్చి
తుదకు జీవచ్ఛవంబులై బ్రదుకుచుండ్రు.

గీ. విటులు సంతతం బుమిసెను పీకిగాను
హీనకాముకమృగముల కినుపబోను
వలపుకాండ్రను వంచించు వలపుచేను
హానిగలిగించునై తాను సానిమేను.

గీ. మేలుకాండ్రను వంచించి యేలుకీలు
భూరిసుఖసంకటంబులు పుట్టుపోలు
కమ్మవిల్తుచొడ్డోలు, పెద్దమ్మవాలు
ఔర! వెలయాలు తోలూడి నట్టడోలు.

ఉ. చిక్కనపాలుగారు నునుఁజెక్కులు గావవి నత్తగుల్ల లే
పెక్కినగబ్బిగుబ్బలవి యేసొరకాయలుగాక, సొంపు పెం
పెక్కినకావిమోవియగు నే యది యెంగిలిబావిగాక, ఛీ
పొక్కిలికిందనుండు నొక ...మిక్కిలిపాక్క నేటికిన్

ఉ. హేయముగా దెచూచియు సహింపగవచ్చునె విత్తకామినీ
కాయమునంతలో నిసారకాయకులన్ వెలచానలూనుచం
దోయికి భేదమేమిగలదో? కపటానలకీలలైన కం
దోయిహారంగురంగులఁగనుంగొని వెంగలివైకలంగుదే?

సీ. బుద్ధినాకర్షించు పూఁతమెఱుంగుల
పైఁడిసలాకకై వడిఁదనర్చి
అత్తరుపూఁతతో నతిరమ్యముగనుండు
కాగితపుగులాబికరణిఁగాంచి
మెఱసితళుక్కున మిఱుమిట్లుగొలుపు పా
వృట్కాలచంచల విధముమెలఁగి
అందమింపొంద నానందింపగాఁజేయు
సాయంసమయసంధ్యసరణిఁదనరి

గీ. పెదవినంటినపూఁదేనె పెంపునింపి
అతిపవిత్రపాతివ్రత్య మవనియందు
నెట్లు మూర్తిభవించిన యట్లు వఱలు
వేశ్యవలచిన మగవాఁడు వెంగలీఁడు.

సీ. భోగినుల్ కపటానురాగసంపాదిత
జీవనల్ ఘోరదుశ్శీలఖనులు
వైధవ్య మెన్నఁడు బాధింపకుండ వ
ర్తించుపిలాసినుల్ హీరహితలు

దుష్టచేష్టితముల । దోషంబు లేదండ్రు
దుర్నయనిర్ణయ । దుర్నివార
లతులమాయోపాయ । లభిమానశూన్యలు
కరుణావిహీనద । కామమతులు

గీ. రాజభయమించుకయు లేని । రాజవదన
లట్టివారలఁ గామించి । యాటపాట
లనుచు నామోదముం బొంది । స్వార్జితంబు
చిల్లిగవ్వగ నెంచి వె । చ్చింపఁదగునె?

సీ. హేమసుందరుఁ డౌర! । యెంతటివాఁడయ్యె
ననుచు నోనాడుదు । రఖిలజనులు
ఘనవైద్యుఁడగుఁగాక । కామినీపరతంత్రుఁ
డని యేవగింత్రు । గృహస్థులెల్ల
జారుండు కపటవే । షధరుఁడు వంచనా
పరుఁడంచు దూషింత్రు । ప్రాణసఖులు
సంగబాహ్యుండు స । త్సాంగత్యహీనుండు
నీతిదూరుండండ్రు । జాతివారు

అత్తమామలు ఛీయని । యాదరింప
రాలు దుఃఖించి వెలిచవు । లభిలషించు
బలాకుబడిపోవు వెలలేని । పరువుతొలఁగు
నిల్లు చిల్లిగవ్వయు లేక । గుల్లయగును.

గీ. విషయములనేవగించెడు। విబుధవర్యు
లింద్రియసుఖాభిలాషయే। హీనమందు
రందువారాంగనాసంగ। మాభిలాష
నీచమనుచు నిందింపరే। నీతిపరులు.

గీ. అఖిలశాస్త్రంబు లెఱిఁగిన। యార్యవర్యు
లతివలనునమ్మరాదని। యందురందు
వెలవెలందుల నేమన। వలయు సఖుడ
వారల జయింపశక్యమే। బ్రహ్మకైన.

సీ. వలువలిచ్చినయంతఁ। బ్రాణనాయకయంచు
వగలవన్నెలఁజూపి। పలుకరించు
రూకలిచ్చినయంతఁ। బోకలాడులనిచ్చ
ముచ్చటించుచుముద్దు। లిచ్చుమెచ్చుఁ
గాసులిచ్చినయంతఁ। గామించుబ్రేమించు
దాసురాలనటంచుఁ। దారసించు
సొమ్ములిచ్చినయంత। నెమ్మలం బ్రకటించు
భోగింపు మనివేగ। కౌఁగిలించు

గీ. వలువ లీకున్న దూషించుఁ। బలువయంచు
రూక లీకున్నఁ బొమ్మని। యీకఁద్రించుఁ
గాసు లీకున్న విరసించు। నీసుపెంచు
సొమ్ము లీకున్న నమ్ములఁ। గ్రుమ్మరించు.

గీ. వారకామినీ స్నేహంబు । వలను వలదు
కూర్మిచెలికాఁడ వాట । వాక్రుచ్చి వాఁడ
నఖిలసుఖసంకటములబ్బ ; । ననుభవించి
పలుకుచుంటిని వెలలేని । భాషణముల.

వ. ఈయంశమిట్లుండె ; మఱియు నొండురహస్యముగల దాకర్ణింపుము.

గీ. నీచసౌఖ్యానుకూలంబు । గోచరంబు
చంచలంబు ; కామాంధకా । రాంచితంబు
జ్ఞానశూన్యంబు దారిద్ర్య । కారణంబు
ద్రోహచింతాన్వితంబు, వ్యా । మోహమనఘ.

మ. జరవ్యాఘ్రింబలె వేచి వేచితుదకున్ । సాధించు, బాధించుభీ
కరరోగంబులు శత్రువర్గమువలెన్ । గాయంబుభుజించు, నే
సారిదిన్ బ్రోచినఁగాని యాయువు స్రవిం । చున్ఛిన్నభాండాంబువై
పరమార్థంబునుగాక తుచ్ఛసుఖము । ల్వాంఛింతురే సజ్జనుల్.

వ. అనినవిని యవ్వైశికుఁడు తిరస్కారసహితమందహాసాంచితవదనుండై.

శా. ఈ వేదాంతము నీ వెఱుంగుదువుగా । కీ నాఁటికె వ్వానికేన్
భావింపందరమా నె? వేశ్యలకు వి । శ్వాసంబు లేదంచు భా
షావైదగ్ధ్యము మీఱఁ బల్కెదవు వే । శ్యాలోలురై యెందఱో
కైవల్యంబును బొందిరీ వెఱుఁగుదే । కామ్యదేవతాఖండలా.

## — వేశ్యాసమర్థనము —

సీ. మునుదాశకన్యను । మోహించి క్రీడించె
నాపరాశరుఁ డెట్టి । యార్యవరుఁడు?
వేల్పుసానింజూచి । వెంబడించి రమించెఁ
గౌశికుం డెంతటి । వైశికుండు
సురవేశ్యలంబట్టి । సురతకేళిం దేలె
మాందకర్ణియు నెట్టి । మానిచంద్రుఁ?
దానాఁడువంచించి । యలయహల్యనుగూడె;
జంభవైరియు నెట్టి । సజ్జనుండు?

గీ. చంద్రుఁడు మహానుభావుఁ డా । చరితమేల?
దారుకావనభాగవ । తంబులుండ
శివునిఁగూర్చి కృష్ణునిఁగూర్చి । చెప్పనేల?
యీరహస్యంబు లెఱుఁగని । వారలెవరు?

ఉ. ఏలఁగసొత్తు లేక, రమియించి సుఖింపఁగసత్తు లేక ప్రా
ల్మాలినవారలెల్లఁ గృతులన్ విరచించిరి నీతు లక్కటా
చాలు; నెఱుంగమే? నిగమశర్మకు లోపముగల్గెనే? యజామి
ళుఁడుమోక్షమొందుటది మిథ్యయె చెప్పుము బ్రాహ్మణోత్తమా.

వ. అనిన విని యవ్విప్రుం డిట్లనియె.

గీ. కృష్ణునింబోలి పదివేల । స్త్రీలతోడఁ
దానురతికేళిఁ దేలుట । ధర్మమైన

డొప్పదింటిలోలి మేవురతగుల మొంది
తనదు కులకాంతమెలఁగిన । దప్పగలదె ?

వ. అత్తఱినస్వర్ణాభరణంబులం గొని యేతెంచు స్వర్ణకారుం జూచి, లోనికేగుమని కనుసన్నం దెలియంజేసి, సుందరుం డవ్విప్రవరునితో నిట్లనియె.

గీ. ఎంతలో నెంతవాఁడైతి । విట్టిసీతి
యిట్టిపరమార్థచింతయు । నెట్లు గలిగె ?
నీమనచిత్తంబు గ్రహియింప । నిశ్చయించి
వాదులాడితి నిబ్భంగిఁ । బ్రాణసఖుఁడ.

గీ. భోగశాలివినీవు విరాగివైతి
మౌనుసీవనినట్లు సర్వాపదలకు
స్థానమగుఁగాదె? వేశ్యల । సంగమంబు;
సంతసించితి నీదువిజ్ఞానమునకు.

గీ. మగుడఁ గన్పట్టెదవుగాక । తగినరీతి
నిన్నుఁగొనియాడ నెమ్మది । నిశ్చయించి
నాఁడనని లేచి, లోనికి । నవ్వుకొనుచుఁ
జనియె; నతఁడట్లయాగాక । యనుచు వెడలె.

వ. అట్లతండులోనికేగి, స్వర్ణకారుఁడొసంగిన యాభరణంబుల నొండుకరండంబున రహస్యంబుగఁబొందికంజేసి యనంతరంబున.

గీ. ఎపుడు సూర్యుండు గ్రుంకు నే । నెపుడు దాని
యింటికేఁగెద నెప్పుడు । తుంటవిల్తు
గేరి రతిసంగరమున సు । ఖించువాఁడ
ననుచుఁ జింతించుచుండ న । య్యావసరమున.

చ. కటకట శీతదిక్కిరణ । కాంతికినోపని యీవియోగులు
త్కటమగువాడు చండకర । కాంతికిఁదాళునొకో యటంచున
క్కటికముఁ బూనినట్లు దిన । కాంతుఁడు తీవ్రతదిక్కువారుణీ
విటుఁడను వైఖరిన్ జరమ । వీథినిఁ ద్రిమ్మరె సానురాగుఁడై.

—— సంధ్యాసమయము ——

చ. అరుణరుచుల్ దిగంతములు । నంతటనంతయుఁ బ్రజ్వలింప ని
ర్జరిఁగలనీరురక్తమను । భ్రాంతికిఁ జిక్కి మృగప్రకాండముల్
బిరబిర నేగుదెంచి ప్రతి । బింబితసూర్యునిఁ జూచి సాధ్వస
త్వరితగతిన్ దొలంగినవి । పావకకుండము గా భ్రమించుచున్

వ. "మనపతి వారుణిన్ వలచి । మాంద్యమునన్ స్మృతిఁదప్పిపద్మినీ
వినుననుఁ బాసె" నంచునళి । నీరవవాక్కులఛాయ మున్నప
ద్మిని కెఱిఁగించి ప్రాక్సతికిఁ । దెల్పఁగ నేగెననంగ నీడ, తూ[న్.
ర్పున కేగఁ బ్రాకె నంతయును । భోమణి పశ్చిమదిక్పరుండుగా

గీ. జగతిఁ జక్రావనఖ్యాతి । నంతరించి
కువలయంబును పీడించు । క్రూరుఁ డీతఁ
డనుచు స్మితముఖ కుముదిని । యినుని,జూచి
పాడెనా న్మదబంభర । ధ్వనులెసంగె.

సీ. రాగాతిశయమున । రంజించి మునుమున్న
పూర్వదిశాంగనన్ । ముద్దులాడి
యంతకంతకు మోద । మభివృద్ధిఁబొందంగఁ
బద్మినిఁ నలరించి । పరిజ్వలించి
వరకరంబులఁజాచి । వారకాంతనుఁబరి
రంభ సంభ్రమపరి । శ్రాంతఁజేసి
వైభవం బుడివోవ । వసుహీనుఁడై యంతఁ
జరమాంగనన్ జేరి । సంగమించి

గీ. తనదుసద్గతిచ్యుతి లోనఁ । దలఁచి తుదకు
నకటసత్సంతతిహసించు । ననుచు వెఱచి
యేరికింగానరాకుండ । నేగె నినుఁడు;
అట్లయగుఁగాదె యమితకా । మాంధకుండు.

చ. వరుణునిపూవటేఁడు మద । వారణదానవారణార్థమై
వఱచినశోణమృచ్ఛయము । వైఖరిసంధ్యరహించినంత భీ
కరమగుదావపావకము । గా మదినెంచిభయంబు పెంపునన్
బరువిడెదిక్కులన్ విధుర । బాధకుఁదోడుగఁ జక్రవాకముల్.

చ. జలరుహపత్రసంచయము । చక్రనిశేయ్యవిహారభూమియై
వలపులసీనుపుష్పవన । నాటి శ్రమంబు నివారణంబుగాఁ
గలువలతావితోమలసెఁ । గమ్మనితెమ్మెరయైన నేమి తా
వలచినకాంతుఁబాసి వల । వంతకుఁజిక్కినచక్రవాకి యే
స్థలమునహాయిగామెలఁగఁ । జాలు;సుఖింపనుపాయముండునే.

చ. రవియనునట్టువుం డపర।రంగముఁ బాసినయంతసంధ్యయన్
యవనికనెత్తివేగమె ని।శాహ్వయ లాసికవచ్చి, రిక్కలన్
బువులనుజల్లి బంభరస।మూహముపాడఁగఁజోరసంచయం
బవ్రుననిసన్నుతింపఁగభ।యానకమున్ నటియించె నెంతయున్

చ. స్మరుఁడనునైంద్రజాలికుఁడు।సాంధ్యరుగంబరమంబరంబున
న్బఱచి, మహాంధకారమను।భస్మమునన్ గనుకట్టుకట్టి, బం
భరకులనాదబీజయుత । మంత్రములన్ బఠియింప వక్త్రగ
హ్వరమునుబాసిపైకెగసి।నట్టిసుమంబులఁబోలెఁదారకల్.

—♦ అంధకారము. ♦—

మ. ననురూపంబునమీఱదం మశివుకం।ఠంబున్ బరీక్షించి, కృ
ష్ణునిచక్కందనమున్ హసించి, హాలిమై।సాంపారువస్త్రంబులం
గని ఛీఛీయని యీసడించి, గిరిజా।గర్వాపహారంబుగా
ఘనమై, సుందరకీర్తిఁబోలిచెలఁగెన్ । గాఢాంధకారంబిలన్.

సీ. విజ్ఞాన మనుసూర్య।బింబాస్తమయమున
మహి నాక్రమించిన।మాయ యనఁగఁ
దనకాంతు నెమకంగఁ । దలఁచి సంచరియించు
ఛాయాసతీకేశ । జాలమనఁగఁ
బ్రజలుభీతిల్ల భీ।భత్సరౌద్రభయాన
కంబులవర్షించు । ఘనమనంగ
వంచించి పాలించు । ప్రభువులపాపంబు
పృథివిపై మూర్తిభ।వించెననఁగ

గీ. వ్యోమసుమవనీదోహద । ధూమమనఁగ
శాకినీఢాకినీభూత।జననియనఁగఁ
గామినీకాముకానంద । కందమనఁగఁ
జటులగాఢాంధకారంబు । జగతిఁగ్రమ్మె.

సీ. పల్లవైశ్వర్యమున్ । వారాంగనవిధాన
నంభోజవనలక్ష్మి । నపహరించి
వరగుణవంతునిఁ । బరదేశముంబలె
భృంగంబులనుదైన్య । మొనయఁజేసి
ధనకామియైయేలు । కునృపతివైఖరిఁ
బ్రజలనిర్బంధించి । బాధపెట్టి
విపులసంపద్రాశిఁ । గృపణునిచందాన
జ్ఞానంబు వ్యర్థంబు । గానొనర్చి

గీ. పృథివినిమ్నోన్నతంబుల । నెఱుఁగకుండ
సత్పథంబును గ్రహియింపఁ । జాలకుండఁ
గడలవ్యాపించి జృంభించి, । కన్నులున్న
చీకులంజేసె లోకులఁ । జీకువాలు.

—♦ అభిసారికలు. ♦—

ఉ. "అండజయాన యిట్టినిబి।డాంధతమస్విని నేడకేగ దీ
వుండుముభీతిలేదె"యను।నొక్కవిటుంగనినవ్వి "నాప్రియుం
డుండుస్థలాంతరంబునకు।నొంటిగఁబోయెదఁగాక, పంచబా

ఖుండు మదీయరక్షకజ। నుండయియుండగ భీతియుండు నే
మందుఁడ"యంచుఁబల్కె నభి। సారికయోర్తుకశారికంబలెన్
చం. దినముఖవేళఁగాకిఁగని । తేకువఁదప్పిభయంబుపెంపునన్
బనులనుమాని, యాత్మవిభుపైఁ । బడి యట్టినిశీథవేళఁజం
గునవడిగోడదాటి యవ। గుంఠనయై యుపనాథు నింటికిన్
జని సుఖయించె నొక్క యభి। సారికకోరిక దీర ధీరయై.
చం. రయగతినాఁటిరేయినొక। రామవిటోత్తముఁగూడఁ గాళికా
లయమున కేఁగ యింకొక వె। లందికినై చనుదెంచువాఁడె స్వ
ప్రియుఁడనికౌఁగిలించి, రతి। రీతులకించుక సంశయించి, భ
ర్తయని గ్రహించె, నాసతీ స। తండును భార్యగలో నెఱింగె నీ
పయి నెడఁబాసియుండమని। బాసయొనర్చిరి దేవిసన్నిధిన్.
సీ. పెండ్లాడనూహించి । విత్తమార్జించితి
నావిత్తమంతయు । వ్యర్థమయ్యె
నీబ్రహ్మచర్యమిం। కెంతకాలం బంచు
నెలమి నే తెంచు సా। నింటిదాఁక
నే తెంచి యచ్చోట । నెవనినో వీక్షించి
సమయంబుగాదని । జంకిమెలఁగుఁ
దోలఁగియింటఁ బరుండఁ । దలఁచు సిద్ధురలేమి
"ననుజూచి నవ్వెనా। వనిత"యనుచు
గీ. నచటికింబోవు, సాహస । మనుచుఁదోలఁగు
వెండియును వేశ్యలుండెడి । వీధికేఁగు

సంకటములుండు నని యెంచు । సంచలించు
వలపునగఁగూరి యపు డొక్క । బ్రహ్మచారి.

వ. త న్నిశాసమయంబున నాహేమసుందరుండు కామాక్షీసుందరముఖచంద్రబింబావలోకన లాలసుండై,

సీ. దర్పణంబునుబూని । దర్పకు దర్పము
ణచుఁ జక్కనివాఁడ । నంచుఁదలఁచి
ఘనసారమిళిత సు।గంధతైలముఁబూసి
కమనీయకాకప।క్షములదువ్వి
వలపు నల్దిక్కుల । వ్యాపించునట్టుల
ముమ్మారు పన్నీట । ముఖముఁగడిగి
కుంకుమంబునఁగొంత । గోరోచనముఁగల్పి
తిలకంబు వేమారు । తీర్చిదిద్ది

గీ. మీసముల నత్తరువుపూసి । మెఱుఁగువెట్టి
చందనములంది ధౌతవ।స్త్రములఁదాల్చి
ప్రసవములఁబూని పాలు స్వ।ల్పముగఁద్రావి
యాభరణ పేటికంగొని । యరుగుచుండ.

గీ. వానివేషంబుఁజూచి యా।భరణపేటిఁ
బట్టుకొని వేగముగఁబోవు । వరుసఁజూచి
తండ్రి యించుక పసిపట్టి । తనయ, యనుచు
నిట్టులనియెను ప్రేమంబు । నెట్టుకొనఁగ.

—◆ జనకానునయము ◆—

శా. తండ్రీ! తండ్రివినీకు, నీప్రధనకాంతం గూడుటంబుట్టువా
వేండ్రిం బేమనవచ్చు; రో వెలఁదులన్ బ్రేమించువారిట్టు లి
ల్లాండ్రం బాపి యశంబుగోసి కులమర్యాదన్ విసర్జింతురే?
గుండ్రాఁబోలిన నీదుమానసము నాకుం ద్రిప్పఁగా శక్యమే?

కం. కులకాంత యౌవనంబునఁ
బులుగడిగిన ముత్తియంబు పోలికనుండన్
వెలకాంతఁ గౌఁగిలింపఁగఁ
దలఁచెదువై ద్యూండవయ్యుఁ దగునెఁ కుమారా.

గీ. విభుఁడవని యెంచి ప్రేమించి వేచివేచి
విసిగి వేసారి నీభార్య వెంగవలనఁ
జిక్కిక్షీణించె శల్యావశిష్టయయ్యె;
జాలి సుంతయు లేదె? పాషాణహృదయ.

ఉ. మూఁడుదినంబులయ్యె, సతిమూల్గుచునుండె, జ్వరంబు హె
చ్చెఁజే, నాడియుమందగించె నొకనాఁడును దేనియలొల్కునట్లు
మాటాడవు; తిండిలేక తడియారెను నాలుక; జావఁద్రావ దే
గోడును లేక నీవు ధనకోమలిఁగూడి సుఖింపఁబోయెదే?

కం. కులకాంత యిట్టులుండఁగ
వెలకాంతను విశ్వసించి వేదురుగొను నీ
తలఁపేమొ నేనెఱుంగను
తలమా; నినుఁద్రిప్పనింద తలపైకెక్కున్.

ఉ. మంచముఁబట్టియున్న కులమానినిఁజూడవు లంజెఁజూచి వే
లంచములిచ్చి పైఁబడి సులాములఁజేసెద విట్టిఘోరమున్
బంచముఁడైనఁజేయుటకుఁబాల్పడఁడోర! వివేకమిట్టిదే?
కుంచముఁబాసి పోలఁగయికొన్న విధంబిది చూవెపుత్రకా.

ఉ. ఈదురవస్థ యిట్లు ఘటియిల్లెఁగదా; విధినేమనందు? మ
ర్యాదనతిక్రమించి ప్రశమాభరణంబును వీటిబుచ్చి, స
త్యాదిగుణంబులన్ విడిచి యూటవెలందికిజిక్కితే? నయా
పాదితబుద్ధి సూనశరవహ్నికి నాశనమయ్యె నక్కటా.

మ. తనయా! నీయవివేకమాపదకు స-స్థానంబుగానుండుఁ నే
పనికిందొందరయెన్నఁడుందగదు; సంభావించిరాఁబోవు మే
లును కీడుంగల లాభనష్టముల నాలోచించువానిం దనం
తన తాసంపదకౌఁగిలించుకొను తథ్యం బేనుబోధించితిన్.

కం. వినురా! నాయుపదేశముఁ
గనురా! నీకులపవిత్రిగౌరవపాత్రిన్
జనురా! సన్మార్గంబునఁ
మనురా! జనలోకమాన్య మాన్యంబులతో.

కం. అనరాదుర, కనరాదుర,
వినరాదుర, పానిదాని పెంపున్ సొంపున్
ఘనరాజ్యవైభవాఢ్యులు
ధనరామలఁగూడిచెడిరి తథ్యముపుత్రా.

వ. అనిన విని యాలంపటుండు, రోషకషాయితలోచనుఁడై భీ
షణభాషణంబుల దూషించి, పెడతలఁగలబుద్ధి నిట్లాడిన
వృద్ధుండవుగాక యనుచు, నింటందిని పరుండఁజాలక నీ
యధికప్రసంగ మేటికనుచు ధిక్కరించి,

శా. ఏ నీమాటలసుంతయున్ వినను; నీ । వేకాదుబ్రహ్మాదులున్
రానీ, తిట్టినఁదిట్టనీ, కలిమియున్ । బ్రాణంబులుం బోయినన్
బోనీ, చెప్పెదనున్నమాటఁదగ దీ । మోమోట మేమైననున్
గానీ, నాచిలుకన్ హారంగు మొలకన్ । గామాక్షిఁగోల్పోవునే

వ. మఱియు ననేకవిధంబుల నోనాడి, గృహంబుఁబాసి వీథిం
బడి యేగుచు,

కం. అనుమానమేలరతులకుఁ
జనుమా, కామాక్షిపలుకుఁ । జక్కని మొగమున్
వినుమా, కనుమా, మనమా
మనుమా సౌఖ్యంబులొందు । మా సంతతమున్.

మ. అనియిట్లాతఁడు కామసంజనితమో । హాభ్రాంతికిం జిక్కి తం
డ్రినిదూషించుచు స్వార్జితంబు ధనమున్ । వెచ్చించి భోగించిన్
ననునోనాడునె? చూడలేక కులకాం । తారత్న మిప్పట్టునన్
దనువుం బాసినఁ బాయుఁగాక ధనము । న్నం బెండ్లి గాకుండునే?
మనమా చింతిల నేటికంచ ఁజని యో । న్మార్గంబు గుత్తించుచున్

వ. అంత నక్కామాక్షి యాతనిరాక కెదురుచూచుచుఁ దన
చేటికం జూచి,

ఉ. అక్కట యేటికింత తడ వయ్యెనొ? వచ్చెదనంచుఁ జెప్పి, తా
నెక్కడ కేగెనొక్కొ? తన యింటిలతాంగికిఁ జిక్కెనొక్కొ? యిం
కొక్క ధనాంగనన్ వలచెనో? నెఱసంజను బంపెఁ జీర ల
మ్మక్క విచారమేల కనకాభరణంబుల కేగి యుండుఁబో?

వ. అని చింతించుచుండు నవసరంబున నాహేమసుందరుని రా
కఁ గ్రీగంట జూచియుఁ జూడనియట్లు నటించి, యతండు విని
సంతసింపఁ దనచేటికతోఁ బ్రసంగవశమునఁ బలుకుచున్న
ట్టు లిట్లనియె :—

ఉ. సుద్దులకేమి లెమ్ము సరసుం డిటువచ్చినఁ జాలమేలుగా
కద్దిర రాకయున్న విరహాబ్ధిఁ దరింపఁగ శక్యమానె? యో
ముద్దియ! నేను నాప్రియుఁడు బొందుగ గూడిన లోపముండునే?
ఎద్దులు బాడియుం గలిసి యేగినఁ గొండలదాటు టబ్రమే.

సీ. పూర్ణేందుబింబమై ముద్దులవర్షించు
మోముగా దది సిగేముగాని
వర్ణింపఁబోలదే కర్ణాంతములఁదాకుఁ
గనులుగా వవి కాంతిఖనులుగాని
భోగింపవలెఁగాక రాగంబు పెంపొందు
మోవిగా దది తేనెబావిగాని
వలుదగుబ్బలుపొంగఁ బైపడవలెఁగాక
యురముగా దది సౌఖ్యభరముగాని

గీ. ప్రియునివినుతింపశక్యంబె । వినమె మనము
వయసుకోలఁదిని ప్రార్థించు । వన్నె లనఁగ
సిరులకోలఁదిని చెన్నొందుఁ । జిన్నె లనఁగ
పుణ్యముకొలందిల భియించుఁ । బురుషుఁ డనఁగ.

ఉ. వానితనూవిలాసములు । వానియొయ్యారము వానిమీసముల్
వానిమెఱుంగుముంగురులు । వానిమనోహరమందహాసముల్
వానివిశాలనేత్రములు । వానిచొకాటపు వాలుఁజూపులున్
మానిని! కంటిచే యితర । మానవులన్ బహుభాష లేటికిన్.

ఉ. ఎన్నఁగ రానిమోహమున । నెందఱొ వచ్చిరి నన్నుమెచ్చి కి
కన్నెతికంబుఁ బ్రాపుటకుఁ । గా వినుమీనవయోవనంబు నే
జన్నియగట్టుకొందులకు? । చక్కనియీవిట కానిగామసం
పన్నిధిఁ బోలువానిబహు । భంగులఁగూడఁగఁగాదె కోమలీ.

శా. ఆకంజాననుఁ, డావిశాలనయనుం, । డావైశికాగ్రేసరుం,
డాకళ్యాణగుణాధికుండు, సుభగుం । డావైద్యలోకోన్నతుం
డాకాంతానవమన్మథుండుఁ సరసుం । డాసుందరుండెట్టులో
నాకుందక్కునుగాక, యేసతికినై । నన్ దక్కునే? నెచ్చెలీ.

సీ. కులకాంత యెట్లున్న । వెలకాంతలనుగోరి
సంగమించి సుఖించు । సంగడీఁడు
నలకూబరునిగోరు । నలరంభనైనను
వలపింపఁ జాలిన । వన్నెకాఁడు,

మురిపెంబులనుజూపి । ముద్దుముచ్చటలాడి
భోగింపనేర్చిన । ముద్దులాఁడు,
తనునమ్మికొనియుండు । ధనకాంతఁ దనకాంత
యనియెంచి పాలించు । నందకాఁడు,

గీ. మేలుమేలన రమియించు । మేలువాఁడు,
నన్నుమెప్పించి పోషింప । నున్నవాఁడు,
చాలు నీలీలఁజాలమే । సైఁపఁజాల
నేఁడురాఁడాయెఁ జూడు మే । జాడఁబోయె.

వ. అనియీరీతివచించుకల్కులకునత్యానందముం జెంది "నేఁ
డనివిం జెందితి నిట్టితన్వి గలదే । ధన్యోస్మి, ధన్యోస్మి, యీ
యనురాగంబునకేమొసంగఁగలనో । హా మన్మథా" యంచు, న
వ్వనజాతాస్త్రిదలంచుచున్నని, కనె । న్వామాక్షిఁ గామాక్షినిన్.

ఉ. ఆతఁడు లోనికింజనిన । యంతనె వంచితముగ్ధమానినీ
వ్రాతకులాభిఘాత, నవ । పల్లవమత్తగజావపాత, యా
నీతవినీతవాక్యనవ । నీత, సమస్తజనాభిభూత, త
న్మాత, విభీతభూతవిట । నాథముఖేందుకళాప్రభాతయై.

చం. ఎదురుగ నేఁగుదెంచియిపు । డిప్పుడు మిమ్ముఁ గుఱించి పల్కుచుం
డఁ దమరువచ్చినా రిలదృ । ఢంబుగ నాయువుఁగల్గియుండుఁడీ
పదపరిచారికల్ కుసుమ । బాణసతీకరశారికల్ నవా
భ్యుదయముగాఁగ నేలుకొను । ఁడోరుపు నేరుపునివ్వటిల్లఁగన్.

చం. అని మృదుభక్తిఁబల్కి కన। కాభరణంబులనొప్ప వేటికం
గొనితనపుత్రికంబిలిచి। కొమ్మనియిచ్చినయంతనామె హ్రీ
వినతముఖాబ్జయైగొనియె; । వేశ్యల కింతటిలజ్జ యొప్పునే
యనిపరిహాసవాక్యముల। నాడిరి తోడిధనాంగనామణుల్.

ఉ. కన్నెతికంబువేర విట। కాండ్రను రండనిచీరి వారి సం
పన్నిధులన్ హరించి యొక। బాలవలెన్ దలవంచె నిప్పుడీ
కన్నియయంచు బాలికయొ। కర్తకనెచ్చెలితోడఁ బల్కఁగ
న్నన్నదల్చెనొక్క నెఱ। జాణమనోహరచంచలాక్షియై.

వ. అంత నాహేమసుందరుండు సుందరదరహాసవదనుండై కాల మిట్లు వెచ్చింపనేటి కని విళంబమున కోర్వఁజాలక,

సీ. సరిలేనిబంగారు। జలతారుచీరల
ననురాగ మొనరఁ గా।మాక్షి కిచ్చి
పట్టంచుగలచీరఁ। బళ్ళెరంబునఁబెట్టి
మర్యాదగా వేశ్య।మాత కిచ్చి
మించుమించిరహించు। మీనంచుగలచీర
సత్యాదరమున మీ।నాక్షి కిచ్చి
సింగార మేపారఁ। జెంగావిరంగుచీ
రల సానిముత్తైదు।వులకు నిచ్చి

గీ. ఎల్లఱుంజూచుచుండఁగఁ। బళ్ళెరమున
నూటపదియాఱులంబెట్టి। మూటనిల్పి

కాంచి, యనిసంతసించుచుఁ । గోర్కెలూరఁ
దాను గదిలోని కేగిన । తత్క్షణమున.

సీ. కమనీయనూతన। కనకాభరణకాంతి
జలతారుచీరతో । సరసమాడఁ
దాటంకముల కాంతి । కాటంకముగఁగాఁగ్రిలు
జిగిచెక్కులను చిన్ని। నగవులూరఁ
దిలకించిన న్మేను। పులకించు నన్నట్లు
తిలకంబువలపించి । వలపు లీన
గుబ్బలిపై నెల్ల। మబ్బుపర్బ్బినరీతి
గబ్బిగుబ్బల పైఁక । గుబ్బతిల్లఁ

గీ. దనదుపదనూపురారవ। మునకు మెచ్చి
యసమశరునిమార్వాద । మైక్యమొంద
విత్తకామాక్షి కామాక్షి । బిత్తరించు
నడలగదిలోని కేఁగె నె। న్నడుమువడఁక.

గీ. వృద్ధవేశ్యయు మీనాక్షిఁ । బిల్చి చంద
నాది తాంబూలములనీయ । నానతిచ్చి
లేచియొక కేల వెండిప। ళ్ళెరముఁ బూని
యామె యారీతి సానుల । నాదరించె.

గీ. చెలఁగి ముసిముసినగవులు । చెంగలింప
నప్పుడంతులు గుసగుస। లాడుకొనుచు

వెలఁదికి సద్వృష్టమిట్లుండ । వలయుననుచు
నేగి రెల్లరుఁ దమతమ । యిండ్లకపుడు.

శా. ఆవేళ న్మనహేమసుందరుఁడు కా।మాక్షిన్ విలోకించి "యా
హావక్త్రాంబుజమిట్టిసొంపుఁగలదే । యాకన్నులున్ జన్నులున్
గావా! లక్షలుఁగోటులున్నరుచిభా।గ్యంబబ్బె రా" యంచు, మో
హావేశంబునఁ గాఁగిలించుకొనె భా।ర్యాఁగూర్చి చింతించుచున్.

ఉ. ఆననమెత్తుమ త్తగజ।యాన! యొకించుక మోవిపానకం
బానెద నానఁదక్కి నను।నానఁగనిమ్మని చెక్కుగీటి యో
మానిని! నీకుమాన ముప।మానవిహీనముగాననిమ్ము స
న్మానముఁ జేసినీకు బహు।మాన మొసంగెదనంచునవ్వుచున్.

శా. శ్లేష్మంబంచుమనోహరంబనుచు న।ల్పీ సుంతినీకోటికిన్
బ్రేష్మంబంచుఁదలంచిమైమఱపున న్వ్రే।మించుచున్నన్నధా
నుష్ఠానక్రియ కానుకూల్యమనుచున్ । ముద్దాడెనల్పిష్ఠబిం
బోష్ఠంబున్ ధననష్టదుష్టవిటులో।కోచ్ఛిష్టభూయిష్ఠమున్.

ఉ. కాయముయౌవనంబుఁగల।కల్మియు శాశ్వతమంచు నెల్లెడన్
హేయముగన్ రతిచ్ఛనతి।హీనమృగంబులఁబోలి యెల్లయున్
ఛీయనసంచరించి కుల।నీతిఁద్యజించిన తుచ్ఛనాయకీ
నాయకదుశ్చరిత్రరచ।నన్ రతివర్ణన మింపుమింపునే?

సీ. రతవాలకమ్ముల । జతఁగూర్చి యిచ్చెదఁ
జెక్కులముద్దిమ్ము । చిగురుబోణి

కట్టుకాసులపేరుఁ గట్టించియిచ్చెద
నైకకట్టునడల్చు రాజవదన
ఆణిముత్తెము లిచ్చి నాణెంబుఁగట్టెదఁ
గుచములానఁగనిమ్ము కోమలాంగి
ఒడ్డారముడుగు మే నొడ్డాణమిచ్చెదఁ
గౌఁగిలింపుము నన్నుఁ గంబుకంఠి

గీ. కనకకమలంబొసంగెదఁ గాంచనాంగి
వాడిచూపులఁజూడకు పద్మనయన
మాటలాడకయుండిన మధురవాణి
కడకుబ్రిదికియుండుట మిథ్య గగనమధ్య.

గీ. అనుచుఁ గామాతిపైఁబడి యావిటుండు
తల్పమునఁగూడె స్వల్పసంకల్పబుద్ధి
నర్థసురతక్రియావేళ నలరుచుండఁ
"దలుపు తలు" పని తమ్ముండు తలుపుఁదట్టెం.

గీ. "ఎవరువా" రని లోనుండి యేఁగుదెంచి
"పిలుపులకుమేరలే" దని తలుపుఁదెఱచి
విటునిగఁ దలంచి పరికించి వృద్ధవేశ్య
హేమసుందరుఁ డాలింప నిట్టులనియె.

క. భళిభళి నీతిలేనిధన భామలసీమల కేఁగి రవ్వకున్
దలుపులఁదట్టిన ట్లిచటఁ దట్టితిరో? వినుఁడొంతతప్పు;ము

ఝులవలపించితుచ్ఛముగ। రొక్కముఁ గైకొనుసానియిల్లుగాఁ దలఁచితిరో తలంపవల। దా? యనినన్ వినియాతఁడిట్లనున్.

గీ. విటుఁడనని లోఁదలంచితి । వేశ్యవగుట
హేమసుందరుతమ్ముండ । నిపుడు వాని
భార్య కవసానసమయంబు । ప్రాప్తమయ్యెఁ
ననిన విని వృద్ధధనకాంత । యతనిఁజూచి.

చ. భళిభళి హేమసుందరుని। వానిసతిన్ వినియుండమయ్యయీ పలుకుల నేడ నేర్చితిరొ?। బాగనుచున్ గనుసన్నఁ జేసి లోఁ గలఁడని; పొందు పొందుతఱి। గాదని నంత నతండు లోగదిం గల తన సోదరుం బిలిచెఁ। గంఠరవంబు దివంబుఁదాకఁగన్.

వ. లోనుండి తమ్ముని పిలుపు పాలకించి యా హేమసుందరుండు.

"ఆఁ" యని "వచ్చుచుంటి" నని। "యర్థరతిన్ రసభంగమయ్యెఛీ ఛీ" యని లేచియావలకు। శీఘ్రగతిన్ జనుదెంచి, "యారనీ వీమెడ కెట్టివేళ నిపు। డీగతి రాఁబనియేమి? బుద్ధిలే దేయిసుమంతయైనవచి। యింపు" మనన్ వినియాతఁడిట్లనున్.

చ. వదినెకు వ్యాధిహేతువునఁ। బ్రాణము మీఁదికివచ్చె, దీనుఁడై ముదుసలితండ్రి యేడ్చిపడి। భూమిపయింబడి మూర్ఛఁబొందెలో నదవదఁ జెంది యింటఁగల। యందఱు భీతిలుచుండి రక్కటా యిదితఱియౌనె? నీదుసుర। తేచ్ఛకుఁ గాలము లేదె చెప్పుమా?

చ. అనవుడు నేవగించి హృద। యంబుననించుక తల్లడిల్లి, "యీ ధనవనితాగృహంబునకు। దక్కితినంచు నిజంబెఱింగి, నా

వనితసహింప లేకరస|భంగముఁ జేయ నిటుల్ నటించియుం
డు"నని తలంచి యెత్తునిక|నుంగవఁ గోపముదోప నిట్లనున్.

ఉ. వచ్చెదఁగాక; నిక్కముగఁ|బ్రాణము మీఁదికి వచ్చెనేని నీ
యిచ్చకు వచ్చునౌషధము|లీయగృహంబున లేవె? యింతకుం
జచ్చినఁ జచ్చెఁ బొమ్మని పె|సన్ గదిలోనికిఁ బోయెనక్కటా!
యచ్చపలాక్షి నప్డు విడ|నాడఁగ నెట్టిఁడు నిచ్చగించునే?

వ. అంత వానితమ్ముండు విచారమనస్కుండై, యతండు చని
నదెస దృష్టినిగిడ్చి

ఉ. పాడి నెఱుంగఁడయ్యెఁగుణ|భామినికిన్ జ్వర మెట్టులున్నదో
చూడఁ దలంపఁడయ్యె వెల|జోటికినై వెసఁబోయె, నెట్లుకా
ళ్ళాడె? నయోమయంబు హృద|యంబని యెంచుక నిల్చి మాఱు
మాటాడక యింటికేగె; నక|టా విధిఁ దిట్టినఁ దోసముండునే?

వ. అనంతర మాహేమసుందరుండు కామాంధీభూత నేత్రుండై
కులనిందాపాత్రుండై.

చ. వలచినవిత్తకాంత నెడ|బాసి కులాంగనఁ జూడకున్న జ
చ్చలహృదయం బొకించుకయు|సంగమకేళికి నిచ్చగింప దా
స్థలమును బాసి యింటికి పె|సం జనఁజాలఁడు కామమోహశృం
ఖలితుఁడు ముందునుయ్యి|వెనుకం జనగొయ్యి సుఖింపవచ్చునే?

వ. అంత నక్కామాక్షి వానిచెంతం జేరి.

ఉ. సమ్ముదముండునే? ప్రథమ|సంగమసౌఖ్యము వ్యర్థమయ్యె మీ
తమ్ముని కారణంబున; గ|తంబగుచున్నది కాలమెల్ల, ధై

ర్యమ్మువహించి వేగమె సు।మాస్త్రుని మెప్పులఁ గొమ్ము లెమ్ము రా
రమ్ము సుఖప్రదమ్మని యు।రమ్మునఁ గ్రుమ్ముచుఁ గౌఁగిలించినన్.

ఉ. ఆతఁడు సంతసించు దర।హాసముఖమ్మున ముద్దులాడు, "నే
మే తరుణీమణీ" యనుచు। నేమొ వచింపఁగఁ బోవునంతలోఁ
జేతము తల్లడిల్లఁగ న।చేతనుఁడౌఁ "గుల కాంత యింట నే
రీతిగ నున్నదో" యని ప్రా।రింబోఁ జింతిలుఁ దేఁజిచూచుచున్

సీ. పడఁతి చెంతకుఁ జేరి । పరిహాసములఁ బల్క
నాతఁ డౌదల యెత్తి । యాలకింపఁ
డీరీతిచింతింప । నేటికంచు వచించు
మాఱుమాటాడక । మౌనమూనుఁ
దన మోము వీక్షింపఁ । దనువుఁ దట్టి హసించుఁ
జెంతెల్లఁ బోవు దృ।క్కుల నిగుడ్చు
వేళ లేదని వాని । బిగి కౌఁగిటం జేర్చ
నించుకంత హసించి । యేవగించు

గీ. "నిట్టు కాలంబు వెచ్చింప।నేటి" కనుచు
ముద్దులాడుచు వలపించు । సుద్దులాడు
"నాతఁ డేమంటివే" యని । యామెఁ జూచు
మారు మాటాడఁ గమకించు । మైఁ జెమర్చు.

ఉ. "నేరము లేదు నావలన।నీ విటులుండఁగ నేటి" కంచు శృం
గారవికారచేష్టలను । కామిని పైఁబడి "సంగమింపఁగాఁ

గోరిక లేదె" యన్నఁ జూలుఁ గుందన మేమియు లేక వేఁడిని ట్టూరుపుఁ బుచ్చి లేచి యతఁడు దూరక దిక్కులఁ జూచి మ్రాన్పడున్.

క. వలపించిన నునుజూపులఁ
దిలకించినఁ గౌఁగిలించి । ధృతి లేని మతిన్
గలఁగించిన విలపించిన
బులకించు నె యాతిప్రేమ । పుంస్త్వముఁ గనునే?

గీ. తమ్ముఁ డేతెంచి సురతమ్ము । వమ్ముఁ జేసి
పిడుగుఁ బోలిన యవ్వార్త । విడిచి చనియె
భార్యఁ జంపినవాఁ డంచుఁ । బలుకుజనుల
నిందకున్ డిందికొందునో । డెందమందు.

సీ. మనసారఁ బ్రేమించు । మగనాలిఁ బడఁ దన్ని
నోనాఁడు నాఁడు లో । లేనిచింత
దారిద్ర్యబాధతఁ । దాళఁజాలక గోపి
మూన మమ్మిననాఁడు । లేనిచింత
వలపులఁ బ్రకటించి । వంచించి తనయొడ్డి
సాని యేగిననాఁడు । లేనిచింత
విషమయౌషధ మిచ్చి । వెంకుసాయనిఁ జంపి
లేచి వచ్చిననాఁడు । లేనిచింత

గీ. ముప్పు వాటిల్లు నని నీతిఁ । జెప్పి తండ్రి
క్లేశ మొందుటకైనను । లేనిచింత

యిప్పు డేటికిఁ గల్గెనో । యించుకంత
యెఱుఁగశక్యంబె? మన కేటి । కింతవంత.

సీ. అతివపైఁ బడినంత । నభ్యాసవశమున
జబ్బ జబ్బుగ గబ్బి । గుబ్బలానుఁ
బరితాపముం బాపఁ । బణఁతి ముద్దాడిన
జిహ్వేంద్రియము మోవిఁ । జేరఁగోరు
వెలకాంత పరిహాసములఁ బల్కు నవ్వింప
నతియత్నమున నవ్వి । యాలకించుఁ
గాంక్షితక్రీడకుఁ । గాంత హెచ్చరికింప
గష్టంబుపై నామెఁ । గౌఁగిలించుఁ

గీ. గన్నుఁ జితిఁజూపి యంతలో । గలఁతఁజెందు
నుస్సురని లేచి వేడిని । ట్టూర్పుఁబుచ్చు
మనసుతునిసిన నెంతటి । మానవుండు
రక్తిఁ గాంచునె వెండియు । రతిఁ బెనంగ.

వ. అంత,

సీ. బహుళాంధకారోగ్ర । ఫణిఫణాగ్రములందు
రాజిల్లు నాయక । రత్న మనఁగఁ
బాలోమినిదిగ్రించు । భర్మహర్మ్యమ్మునఁ
గ్రాలువిద్యుద్దీప । కళిక యనఁగ
జారచోరులకు సం । జ్ఞాసూచకంబుగ
సమయపూరుషుఁ డూఁదు । శంఖమనఁగ

గగనసంగ్రామ రంగస్థ మసీనకుఁ
దో ర్వంజూపంగవచ్చు దొరయనంగ

గీ. నుదయదిక్కాంతయునువను నొసఁగఁగూర్చు
స్వచ్ఛసంఫుల్లమల్లికాగుచ్ఛ మనఁగఁ
బొడమెఁదూర్పునఁ గాముకు లడలిపొక్క
వెలుఁగులకు నిక్కయగు నొక్క వేఁగుఁజుక్క.

గీ. ప్రాచినప్పుడు నవసాంధ్య రక్త కాంతి
వెలువడిన యంత రాజిల్లె వేఁగుఁజుక్క
యినసభాగతోమః కాల ధనలతాంగి
ముక్కునధరించు ముక్కర ముత్యమనఁగ.

ఉ. "గాయకులార మేల్కొనుఁడు గానకళాభ్యసనార్థమంగవా
నాయకులారలెండిఁక పునారతికిన్ నివురింపుఁ డింకభూ
నాయకులార" యంచుఁదమ జ్ఞానముఁదెల్పినరీతిఁ 'గుక్కురో
కో' యనికోళ్లుకూసినవి కొండలఁ బల్లెలఁ బట్టణంబులన్.

ఉ. మానివరుండొకండు మతిమంతుఁడుకుక్కుటభుగ్నకంఠని
స్వానమునాలకించి నదిస్నానముఁజేయఁదలంచి లేచి చం
ద్రాననభార్యఁజూచి "యపురా" యనివెండియుఁగౌఁగిలించె న
జ్ఞానమొమోహమో యమరనాధునిమోసములోఁదలంచెనో

చ. తనసఖి తామ్రచూడరుతంబును వీనులనాలకించి మే
ల్కనిమునుపూర్వదిఙ్ముఖముఁ గాంచిగవాక్షమునుండివీధులన్

గని తటిమించెనంచు వడిఁ గాళ్లు తడంబడ నేఁగుచుండఁగన్
గనుఁగొని కౌఁగిలించెఁ దమకంబున నొక్క గృహస్థుఁ డత్తఱిన్.

మ. ఒకస్వైరాంగన తృప్తిఁ దీఱ నుపరత్యుత్సాహమందుండఁగాఁ
గృకవాకుధ్వని యాలకించి సురతక్రీడన్ విసర్జించి లో
“సకటా రాత్రిగతించెనే” యనుచుఁ బూర్వాశన్వ్యాలోకించి కా
ముకునిం గాఁగిటఁ గ్రుచ్చి గ్రుచ్చి శయనంబున్ బాసె శీఘ్రంబుగన్.

గీ. వాగసతిఁ జూడ దినరాజు వచ్చెననుచు
సమయపురుషుండు ప్రాక్సభాస్థానమునను
పఱచినట్టి కెంబట్టుతివాసి యనఁగఁ
బ్రాచి దీపించె నవసాంధ్యరక్తకాంతి.

గీ. పురుషకారంబులేని భూవరునిఁ బోలి
ఋక్షములకాంతి క్షీణించె నించుకంత
యక్కడక్కడ నొక్కొక్క చుక్కగాలెఁ
గలియుగంబున సుజనుల పొలుపుఁ దెలుప.

సీ. ఆర్యులనెడఁ బాయు నజ్ఞానులనఁగను
గకుబంతములను జీకటులు తొలఁగె
నర్థకాంతం గూడు యతితేజముం బోలి
యఖిలదీపనికాయ మంతరించె
జనపతిమానిత జనముఖంబులరీతిఁ
గుందంబు లెల్లెడఁ గొమరుమిగిలె

నిబిడద్రుమంబులు । నిబిడగర్భిణులట్లు
పాండువర్ణంబున, । బరిఢవిల్లె.

గీ. నల్పముగఁగూసె రాజన । భాంతరమునఁ
బరిచయము లేని కవిభాతిఁ । బరభృతంబు
వరతపశ్శాలిహృదయంబు । సరణి నపుడు
గగనవీథి నిర్మలకాంతిఁ । గ్రాలుచుండె.

సీ. వరపల్లవవ్రాత । పరిచయంబున ఫుల్ల
కుసుమాసవంబును । గ్రోలిక్రోలి
క్షితిజగర్త్వాణుఁడట్ల । గీర్తిసంపాదించి
దిక్కులనల్లెడఁ । దిరిగితిరిగి
పురవీథులందారి । వరగవాక్షంబులఁ
జోరునిచందానఁ । జొచ్చిచొచ్చి
రాత్రినిర్భయముగ । రాజప్రియాంగనన్
గుముదినిఁ బుష్పిణిం । గూడికూడి.

గీ. సరసులంజేరి పంకజ । సౌరభమున
నలరి సంతతగమన ప్రి । యాసమునకు
నలసి నొలసెనోయిపుడు మం । దానిలుండు
మందగతిఁబూని మనుజు లా । నందమొంద.

గీ. వింగినక్షత్రకాంతి । క్షీణించినంతఁ
దన కలిమివోయెనని నిశా । తరుణి సకల

విహగకృతరుతచ్ఛలమున । వెక్కివెక్కి
వసుధ నెల్లెడఁ దుహినబా । ష్పములవిడిచె.

మ. జడలన్ జుట్టినపుష్పహారములువి । స్రంసంబులై చూడఁగాఁ
బొడిసున్నంబునుబోలిచందనము సం । భోగశ్రమాంగంబులన్
నడలన్ బైటలఁజార్చుచున్నరసులన్ । నవ్వించుచున్నవ్వచుం
జడయానంబుల నేఁగుచుండిరి నగస్నానార్థ మర్థాంగనల్.

— సూర్యోదయము —

గీ. గగనస్థనక్షత్ర । గణతండులంబుల
మెక్కుటంబుగ మెక్కు । కుక్కుటంబు
స్ఫురదిందుమండల । జ్యోత్స్నాగ్నితప్త ప
ద్మోద్యానవనవసం । తోదయంబు
నక్రమప్రక్రియం । జక్రవాకములకు
ననురాగముం గూర్చు । నౌషధంబు
భూరిరాగావృత । పూర్వదిక్కామినీ
కుచకుంభవిన్యస్త । కుంకుమంబు

గీ. అంధకారకాంతార దా । వానలంబు
కమలదళబద్ధ భృంగమో । క్షప్రదంబు
ప్రాచినుదయించి దీపించె । వారసతికి
మండనంబుగ మార్తాండ । మండలంబు.

గీ. కమలపత్రవిశాలనే । త్రములఁజూచి
కరములంజాచి బిగియారఁ । గౌఁగిలించి

మున్ను ఘటమానకుచకోక । ములస్పృశించి
యరుణబింబాధరామృతం । బానియాని
వారసతిఁగూడి సుఖియించె । భాస్కరుండు.

ఉ. అరుణముఖప్రతాపరుచు । లంతటఁ జిమ్ముచుఁదోఁచినట్టియా
వారిఁ యుదయాద్రిసీమంబి । డాంధ... కరికుంభమున్ గరో
త్కరనఖరంబులన్ దునుమఁగా భువిరక్తముత్తోఁ ముత్యముల్
తొరఁగెననంగ నాతపము । తోడరహించెఁదుషారబిందువుల్

అనంతర మాహేమసుందరుండు వాఁచినలంకరించిన మా
ర్తాండబింబావలోకనంబునఁ దల్లడిల్లి కామాక్షింగౌఁగిలిం
చుకొని, మాగుడవచ్చెదం గాక యని వచించి,

. వేళ యతిక్రమించెఁ బుర । వీథులసందడి హెచ్చె, నార! యే
లీలగృహంబుఁ జేరవలెఁ? । గ్రేళమునన్ మతిఁదప్పెఁదండ్రి; యి
ల్లాలెటులున్నదో; యకట । ప్రాణము మీఁదికివచ్చె నేమొ? నే
జాల మొనర్పరాదనుచు । జంకుచు నింటికి నేగె నవ్వడిన్.

. ఎటులో కామాక్షిఁ బాసి, త । ద్గృహమునుండి
యతఁడు పురవీథులంబడి । యరుగుచుండ
నెల్లఱుం జూచి ఛీ యని । యేవగించి
"ఇంతవాఁడయ్యె నే" యని । యెంచి రపుడు.

. పువ్విలు కానితూపులకు, మోహితుఁడై సదసద్వివేకమున్
దవ్వుగఁ బాసి, వైద్యమను । దంభమునన్ ధనయావనంబులన్

క్రొవ్వి, కులాంగనన్ విడిచి కొంకక సొమ్ములఁ బెట్టియాలి కే
అవ్వలకుఁ బాత్రుఁ డయ్యె ధనరామను గూడి సుఖింపఁ జాలెనే?

గీ. ఆతఁ డారీతి నాత్మగృహంబుఁ జొచ్చి
శోకవిహ్వల చిత్తులై సొలియేడ్చు
వారలం జూచి తండ్రి యవస్థఁ జూచి
చచ్చిపడియున్న యిల్లాలి సరణిఁ జూచి.

గీ. భోరు మని యేడ్చి యయ్యొ! యంభోరుహాక్షి
నన్ను విడనాడె నకట రానున్న చావు
రాక యుండునె? యెట్టిక గతి ఘటిల్లె
దైవమా యంచు దుఃఖమంతయు నటించె.

మ. కడుపుం గానుపు లేక యున్నఁ దగు సౌఖ్యంబేమియున్లేక యా
న్నడు వారోగ్యము లేక చూడ నగలున్ నాణెంబులున్లేక, రాఁ
బడి రోతొత్తులకిచ్చి మెచ్చు చుగనిన్ బ్రార్థించిఁ దుఃఖించిఁ యి
ప్పుడు ప్రాణంబులఁ బాసె నమ్మగువ యా మూర్ఖుండు చింతించునే.

సీ. ప్రేమింపకుండినఁ బెడ్డాడినందుకే
నాడైనఁ గూడి ముద్దాడె నొక్కొ?
అనురాగ మెల్లున్న నాకుపోకల కంచు
నొకనాఁడు యూకైన నొసఁగె నొక్కొ?
వెలకాంతఁ గూడెఁబో కులకాంత యనియైన
నరసి నోరారమాటాడె నొక్కొ?

వలపెంత లేకున్న । జ్వరపీడితగ భార్య
నెపుడైనఁ జూచి మందిచ్చెనొక్కొ ?

గీ. నరసు దగుఁగాక యవసానసమయమునకుఁ
దమ్ముఁ జేతెంచినన్ జూడఁదలఁచె నొక్కొ
లోకు లేమందురోయను । శోకమొందు
దక్క తదితరదుఃఖ మాతనికిఁ గలదె ?.

వ. అట్లు తండు లేనిదుఃఖముం బొయి నటించి భార్యకు దహనసంస్కారాదిక్రియల నిర్వర్తించి,

సీ. బ్రదికియుండినవేళ । భార్య కీయకయున్న
వలువల ముత్తైదు । వులకు నిచ్చెఁ
గా సైవనొకనాడు । కాంత కీయకయున్న
నేడు దక్షిణల సంతృప్తిఁబఱచె
భుజియించెనో లేదొ । పొలఁతిఁ జూడకయున్న
తమ్మసురెందులకు భోజనముఁ బెట్టె
నా లంచుఁ బ్రేమించి । యాదరింపకయున్న
వాత్మబంధువుల నే । డాదరించె

గీ. నగ్నిసాక్షిగఁ దాను పెండ్లాడినట్టి
భార్యదురవస్థకును నాఁడు । వగవకున్న
బంధువులు పరామర్శకు । వచ్చినంత
బోరుమని వెక్కివెక్కి నే । డోరువెట్టె.

వ. అనంతరమా హేమసుందరుండు భార్య మరణించినందుకు సుంతయుఁ జింతింపక మిక్కిలి మచ్చమానసెనని యమితానందకందళితస్వాంతుండై, యథేచ్ఛసుఖంబులం గామాత్ముఁగూడి విహరించుచు, వారమెయింటికివచ్చుచుం బోవుచు నపూర్వహారంబులఁ బెట్టి యాభరణంబులఁ గల్పించి విక్రయించుచు, నమితవిత్తంబుఁబ్రజలవంచించియార్జించుచుఁ గులమర్యాదల విసర్జించుచునెల్లర నీసడించుచు స్వాతిశయంబున సంచరించుచుండెనంత.

—♦ గ్రీష్మము ♦—

సీ. చారవాతవిభీత । సర్వజీవవ్రాత
సంచారరహిత నిర్జనపథంబు
చండరుజ్మార్తాండ । మండలాతపతప్త
సత్వస్వనావృతా । శాతటంబు
క్లుప్తవల్మీకాంత । సుప్తాహినిశ్వాస
దీప్తాగ్నితప్త పృథ్వీరుహంబు
పంకావశిష్ట పల్వలమధ్యవాసకృ
ద్భికరసూకరీ । సూకరంబు
గీ. కాసరీకాసరోత్క్షిప్త । కర్దమంబు
ఖగసమాశ్రితసకల వృక్షవ్రజంబు
ఉష్ణకరతప్తకూపజ । లోష్మమైన
గ్రీష్మమేతెంచె జనలోక । భీష్మమగుచు.

సీ. తనదుకాయచ్ఛాయఁ । గనుఁగొనిమహిషంబు
పంకంబుగానెంచి । పందుఁగొనియె
భూరిగుంజాపుంజముం జూచి కాకంబు
రక్తపూరంబని । భ్రాంతిఁజెందె
ఛాయలవీక్షించి । జలముగా భావించి
శునకంబులై పరువిడి । సోలుచుండె
సంతాపముంబొంది । సర్పంబుగజతుండ
ముంజొచ్చి వల్మీక । ముగఁదలంచె

గీ. ఛాయ, సతిఁబోలిపాదంబుఁ । బాయకుండె
ఖలునిదుర్వచనంబుల । పొలుపునింపి
యునకరంబులు ప్రాణుల । యేపణంచి
చెప్పనొప్పౌనె? నిప్పుల । నుప్పుచుండె.

గీ. సకలవిరహుల దీర్ఘ ని । శ్వాసమునఁగ
వీథులను వేడిగాడ్పు । వీచుచుండెఁ
బాదుటాకులరాలిచి । పాదపంబు
వనమునఁ దపించె వరదిగం । బరునిఁబోలి.

గీ. ఛాయవిరహిణిఁబోలి కృ । శత్వమొందెఁ
బిశునమానసమట్లు త । పించె జలము
కృపణునైశ్వర్యముంబోలి । వృద్ధిఁబొందె
నర్ధగులఘోర దుర్దాహ । మవనియందు.

గీ. ఉగ్రసూర్యాంశువుల వేడి । కోడి లేడి
యక్కటా హీనవృక్షంబు । నాశ్రయించెఁ
దనదుభాగ్యపరిక్షీణ । దశదలంచి
సాధువాకనీచునిం జేరు । చందమునను.

చ హారహారులున్నిదాఘసమ। యంబునకోడి, తుషారభూమిభృ
త్సరిదధినాథులందుఁదమ। చానలగూడిసుఖంచుచుండఁదుఃఁ
స్తరపరితాపముస్స్వరహా। తాపమునోర్తుమెయంచుఁబచ్చక
ప్పూరముఁగలట్టిచందనముఁ। బూసిసుమంబులఁదాల్చిసుర్వ
టుల్ బిరబిరసంచరింపఁదల। పెట్టిరిపుష్పమరేయినెల్లెడన్.

గీ. విటులుకొందఱు వేశ్యల। వీధులందు
సంచరించుచుఁ గామాక్షి। సదనమునకు
సుందరుఁడులేని సమయంబుఁ । జూచి జొచ్చి
సరసగతిఁజేరి రామెను । సురతమునకు.

వ. అంత నక్కామాక్షియు,

చ. ధనముఁబరిగ్రహించి సుర। తంబున వారలకోర్కెఁదీర్చనె
మ్మనమునవిశ్చయించి, యను। మానవశంబునభీతి పెంపునన్
దనదుమనోహరుండు దఱిఁ। దప్పకవచ్చునో యంచునెంచి
పొం దనుచునిరాకరించిన మ। దాతిశయంబున వారలెల్లఱుఁ
చ.కినుకవహించి "మమ్ముఁబరి। కింపవొ? విత్తముసంగినంత,యకా
వనమునువిక్రయించి విట। వర్యులఁగూడెదుతొత్తువయ్యుబొం

డనుచు నిరాకరించె నిది। యా మరియాద? భవచ్ఛరీరముం
దని మొదమా నెలంజ" యని। సమ్ములు చిల్లులవ్వ వమోఘచుం
చ. "ధనముఁ బరిగ్రహించి సుర। తమ్ము పమమ్ము సుఖింపనిమ్ము నీ
దునుమక యేలుకొందు" మని। దూఱుచుఁ గట్టు సడల్చి రొక్కఁడా
వనితను కౌఁగిలించి బల। వంతముగం రతి కుద్యమించినం
తనె చనుదెంచి సుందరుఁడు। తద్దురవస్థను జూచి మ్రాన్పడెం.

గీ. మ్రాన్పడినవాని వీక్షించి। మండిపడుచు
విటులు గుమికూడి దుమ్ముల। విఱుఁగఁ గొట్టి
రంత నాతండు దైవమా। యనుచు నఱచి
చతికిలంబడి యెంతయు సంచలించె.

గీ. అతని యాక్రందనధ్వని। యాలకించి
యిరుగుపొరుగులఁ గలవార। లరుఁగుదెంచి
వాత్తుహత్తని బెదరించి। రంత విటులు
వెఱచి పఱచిరి దిక్కుల। వెదకికొనుచు.

వ. అంత నా హేమసుందరుఁడు బ్రిదుకుజీవుఁడ యనుచు మె
ల్లగ లేచి, యెల్లఅంజూచి లజ్జించి, వెండియు ధైర్యము
వహించె.

సీ. "నారహస్య మెఱుంగని। వారు గలరె?
ఇంక యాఱక లజ్జింప। నేటి" కనుచు
నాఁటినుండియు భయము సం। తయును లేక
వెలవెలందిని దనయింటఁ। బెట్టుకొనియె.

వ. ఇట్లక్కామాక్షి నింటఁబెట్టుకొని యథేచ్ఛాసుఖంబుల నం
చరించుచు.

సీ. "అర్థంబు లేదయ్యెఁ । దీర్థయాత్రల"కంచుఁ
దనివిఁ బొందని దాని । తల్లికొఱకుఁ
"కట్టుబట్టయు లేదు । కఱవు తీఱదె"యంచు
వాదులాడెడు దాని । సోదరునకుఁ
"కూటికి కఱవయ్యె । గొప్పపాపిక"యంచు
వెక్కిరించెడు దాని । యక్కకొఱకు
"నెంతవాఁ డనుకొంటె । నేమిలే" దని వాని
వాసిరోసిన దాని । దాసికొఱకు

గీ. పన్నగారంచుఁ ద్యాగంబు । సున్నయంచు
వావులంగల్పుకొను దాని । వదినకొఱకు
నున్న దనియు లేదనియు లో । నెన్నకుండ
కలిమియంతయు వెచ్చించెఁ । దెలివిఁదక్కి.

గీ. వలువ లనుచు నలంకార । ములకు ననుచు
సొత్తుఁ గామాక్షి సంగ్రహిం । చుటయుఁ గాక
దొంగతనముగ గృహమును । దోచుకొనియె
నప్పులకుఁ జిక్కె నాతని । యార్జితంబు.

గీ. తమ్ముఁ డొకవిత్తకాంతను । దగులుకొనియెఁ
ద్రాఁగుఁబోతయ్యెఁ బినతండ్రి । తగవుమాలి

తండ్రి కూళూచి యేడకో । తలఁగిచనియె
వానిదురవస్థ వర్ణింప । వశమె మనకు.

గీ. వంచకుం డంచునజ్ఞాని । వైద్యుఁ డనుచు
శాస్త్ర మెఱుఁగనివాఁడంచు । జారుఁడంచు
జను లెఱింగినయంతనే । సన్నగిల్లె
నంతకంతకు నప్పాడి । నతనివృత్తి.

గీ. తనదుగృహలక్ష్మి పరలోక । మునకు నేగ
నకట పెద్దమ్మఁబోలిన । యర్ధకాంత
యింటి కేతెంచె నైశ్వర్య । మెట్టులుండుఁ?
గడకుఁగడ తేఱకుండునే । కపటవృత్తి.

ఉ. మాన్యములెల్ల నప్పులకు । మాటువడెన్ గలలోనికల్మి నా
ధాన్యము సన్నగిల్లె, జల । తారుగలట్టి సుకూలవస్త్రముల్
శూన్యములయ్యె సల్లుగను । సొంపుచెడన్ గులమేవగింపఁగన్
దైన్యమునన్ గృశించె మతి । దప్పిచరింపఁగఁజొచ్చె నల్లెడన్.

మ. చుడిమాటందలపెట్టరాదుత్రోలఁగన్ । మాగాణియేగానికిన్
దడవౌటన్ గడువడ్డియున్ బెరుగుటన్ । దాకట్టువాకట్టుగా
బడివమ్మయ్యెఁగ్రమక్రమక్రమముగా । వస్త్వంబుక్షీణించె, రాఁ
బడికాసైనను లేదుతుట్టతుదకున్ । బాధించెఁగామాక్షియున్.

ఉ. దైవభయంబుఁదక్కి భుజ । దర్పము విత్తము విశ్వసించి, స
త్కోవిదులన్ జనోత్తములఁ । గుత్సితులంచుఁదృణీకరించిదు

ర్భావనలన్ మదించిధన । భూమఁ బ్రాపకుఁడై "వినాశకా
లే విపరీతబుద్ధి" యను । లీలఁ జరించిన లక్ష్మి నిల్చునే?

వ. ఇల్లు కొంతకాలంబు గడచిన యనంతరమున,

ఉ. క్షామము దక్కె నింటఁ గన । కం బొకయించుకయున్ లభింప దీ
లేమికిఁ దోడు వృత్తియు ఫ । లింపక పాడయె నన్యవిత్త కాం
క్షామయ భక్షితాత్ముఁడని । యాతఁ డవీఁడొక్కనె వామదేభ రా
డ్గామిని నీతిలేనిధన । కామిని కామి మఱొక్క కామియై.

గీ. తైలమంతయు క్షీణించు । దనుక వ్యాఖ్య
వ్రాయఁదగునన్న పండిత । న్యాయ మెంచి
యాతనిమైశ్వర్య మంతయు । ననుభవించి
యన్యునిం జేరి సుఖియించె । నాలతాంగి.

వ. భార్య మరణించుటకుముందు తా వలచిన యక్కామాక్షి యన్యవిటసమాకర్షితచిత్తయగుటకు మిక్కిలి చింతించి, దారిద్ర్యభారవహనక్లేశంబునఁ దల్లడిల్లి పరితాపంబునఁ దపియించుచుండ,

## — వర్షాకాలము —

శా. వర్షం బెట్లగు? హంసధర్షమయి, చి । త్తాకర్షమైఁ యంబుదో
త్కర్షంబై గృహిణీవియోగగతచిం । తాక్రాంతపాంథవ్రజా
మర్షంబై కకుబంతకుంభగళితాం । భఃక్లిన్నభూశీర్షమై
వర్షాకాలము వచ్చెఁ బ్రజ్వలితశం । పామాలికాభీలమై.

గీ. వగవలాకదంతంబుల । వాసిఁగాంచి
ప్రస్రవద్వారిదాన ధా।రల వహించి
భూరితటిదంకుశవిఘాత।ములకు నలిగి
గగనవీథిని గర్జించె । ఘనగజంబు.

గీ. ఇండ్లకుం బోండు భార్యల । నేలుకొనుఁడు
పాంథులార యంచు జగానఁ । బంచశరుఁడు
ఢమఢమధ్వనిమ్రోఁగించు । ఢక్కయనఁగఁ
గడల నడరె ఘనాఘన।గర్జనంబు

గీ. మేఘుఁడను క్రూరదైత్యుఁ । డమోఘబలుఁడు
నింగిఁగలచంద్రసూర్యుల । మ్రింగినంత
వార లొనరించు రోదన।ధ్వనియనంగ
దిక్కులను గర్జనంబు ప్రతి।ధ్వనించె.

గీ. యువతిచిత్తవృత్తి గ్రహింప । నోపకెందు
మూఢులై సంచరించు కా।ముకు లెఱుంగ
నస్థిరమనేకరాగర।మ్యంబు గుణవి
హీన మను రేంద్రచాప మొ । ప్పెసఁగెది విని

గీ. ఘననృపతియుండు గగనప।త్తనమునందు
నింద్రచాపమన గోపుర । మెత్తువేళ
విరసవాక్కులవర్ణించు।భేకనామ
కాకవులకుఁ బంకాభిషే।కములభించె.

సీ. సూచికాభేద్యమై । చూడసొంపుగ మేఘ
మఖిలదిక్తటముల । నాక్రమించె
మబ్బులవీక్షించి । మదవికారంబునఁ
గేకులు క్రేయని । కేకరించె
నాశాంగనాతార । హారంబులనఁబోలి
యమితధారాసార । మతిశయించె
నదులునూతులుచెఱువు । లెదిగి యేకముగాగ
నధ్వగసంచార । మణఁగిమణఁగె

గీ. వాతపోద్ధూతసంతాప । మంతరించె
విరహిణీమనస్తాపంబు । పెచ్చుపెరిగె
దుర్దినం బని జనులు కుం । దుటకుఁదోడు
దుర్గమంబుగవ్యాపించెఁ । గర్దమంబు.

శా. ఆరావప్రతిరావముల్ నిగుడనీ । లాభ్రాబువర్షించె నే
డౌరా! చిత్రము; వారకాంతయనసూ । ర్యంపశ్య యైయుండఁగా
గానీరేజాప్తునిఁజూడకంతిపురులన్ । నిద్రించుసద్భైక్షుణల్
వారస్త్రీఁ దిలకించిహేళనముగన్ । భాషించినం జెల్లునే?

కం. చిటపటచినుకులు రాలెను
పటపటమనిపండ్లుకొరికి । పాఱెను హంసల్
వటవట పేలిరి విరహులు
కటకటపడుచాతకముల । కడుపులు నిండెన్.

వ. ఆహేయసుందరుండు వర్షర్తుశీతలవాతపోతసందీపితకామాగ్నిసంతప్తుండై, యనేకభంగులం జింతించి, దుఃఖించి కులకాంతం దలంచి, పశ్చాత్తాపముం బొంది, యన్యవిటసమాకర్షితచిత్తయై తన్నుడం బాసిన కామాక్షిం దలంచి వలవంతకుం జిక్కి, సొక్కి, పంచబాణనిర్భిన్నహృదయుండై, పూర్వపరిచయంబునకైన నన్నాదరింపకున్నె, మోమాటము లేకయున్నె యని నిశ్చయించి సత్వరంబుగం గామాక్షిగృహంబున కేగినంత,

గీ. అకట కుందేటివేటకు । నరుగువాని
బెబ్బులి యెదుర్పవచ్చిన । విధముదోప
వలచి కామాక్షివీక్షింప । వచ్చువాని
నెదురుకొని రండు రండనె । వృద్ధవేశ్య.

గీ. రండు రండని యత్యాద । రమునఁ బిల్చి
యాసన మొసంగి భాషించి । వేసముంగని
భళిర కాసైన లేకుండ । వచ్చెననుచు
వికటముగ నవ్వి కోపించి । వెక్కిరించి.

గీ. "తగుదునని యెంచి కామాక్షి । తగులమునకుఁ
బరుగుపరుగున వచ్చితే । బాగు! బాగు!
పొట్టకును బట్టకును లేక । పొక్కెదీవు.
కానియున్ లేనివానికి । సానియేల."

మ. రజతంబున్ గనకంబునంబరములన్ గ్రామంబులన్ మేడలన్
గజయూధంబుల గొప్పవారువములన్ గామాక్షికీవచ్చితో?
రజకుండిచ్చినయన్యవస్త్రములు నైరాజిల్ల నుప్పొంగుచున్
భుజముల్ద్రిప్పుచుఁ జూడవచ్చితివి పో పోబోడిసోమాదిగా.

గీ. అనుచుఁ బైఁబడవచ్చిన యామెఁజూచి
సరససల్లాపసంభోగసౌఖ్య మనెడు
బిచ్చమున కొక్కదండంబు వేఁపెఁగట్టు
కొనుము కామాక్షి యనుచు నాకుటిలుఁ డేగె.

చ. అరిగిగృహంబుఁ జేరికులటాంగనచేసినమోస మెంచి సుం
దరుఁడుసుమాస్త్రబాధ కెదఁదాళఁగ లేకకృశించియింటికిన్
బోరుగునవాసమున్న యొకముద్దులగుమ్మనుజూచియామెతో
సరసముఁ జేయ నెంచికనుసన్నలఁ దెల్పిగ్రహించెసమ్మతిన్.

ఆ. అర్ధరాత్రిమువేళ నాపెవాసముఁ జేరి
సురతకేళిఁదేలి సోలిసోలి
గళమునందుఁ గ్రాలు కాంచనాభరణంబు
సంగ్రహించి యేగు సమయమునను.

చ. కులటనుమించునంచుఁదన కోమలిపైఁగలనాదియంబు చే
నలికిడిఁబట్టి యెవ్వఁడో నిజాంగనకైచను దెంచెనంచు లోఁ
దలఁచి మగండు మేలుకొని దానివిటుంగని చోరుఁడంచున
క్కలిపడి దొంగదొంగయని కెవ్వనెడ్చెఁబురంబు మేల్కొనన్

చ. పలువురువచ్చిసుందరునిఁ బట్టి గళాభరణంబుఁగాంచి లో
నలరి తలారులం బిలిచి రంతట వారలువచ్చి చోరుఁడౌ
క్కలుఁడనివానిదుమ్మొలను గట్టిగఁగొట్టి కరంబులన్ వడిన్
గొలుసులఁజేర్చికట్టి చెఱ కున్ జనిరేమనవచ్చుదుర్విధిన్.

వ. అమ్మరునాఁడారాజభటులు,

గీ. చంద్రరేఖయను సాధ్వి కొలువుండు సమయమునకు
హేమసుందరుఁ గొంపోయి యెదుటఁ బెట్టి
యపహరించినవాఁడంచు నాభరణముఁ
జూపి యాజ్ఞకై తెలిపేటి చూచుచుండి.

వ. అనంతర మాభూపాలవరుండు జారచోరశిఖామణియగు
నాహేమసుందరుం దిలకించి యతండు వైద్యవృత్తిని జీవిం
చువాఁడుగా సభ్యులవలన నెఱింగి నిజాస్థానరాజవైద్య
వరుల రావించి, వైద్యశాస్త్రజనితజ్ఞానం బమోఘంబని
ప్రశంసించుచు హేమసుందరుఁ బరీక్షింపఁదలంచి, సభ
లోఁ గూర్చుండఁబెట్టి,

క. చలమేపారఁగవైద్యశాస్త్రవిధులన్ జర్చించి, రోగంబులం
గలభేదంబుల నౌషధంబులఁ బరీక్షం జేసి, మూర్ఖుండుఁ లో
కులవిత్తంబుహరించుచోరుఁడనుచున్గోపించి యత్యుగ్రుఁడై
"వలువా" యంచువిధించెభూవరుఁడు యావజ్జీవనిర్బంధమున్.

వ. ఇట్లాహేమసుందరుండు,

శా. కారంజిక్కి కృశించి దైన్యమునను । గ్కాలంబు దుఃఖించియా
కారా! దైవము ప్రోవుమంచు నెదలో । ధ్యానించి క్షీణించె, సం
సారం బంచుఁ గులాంగనం దలఁచి ప । శ్చాత్తాపముం బొందె దా
గారాజంబుగ నేలినట్టి కులటన్ । గామాక్షి గర్హించుచున్.

గీ. నీతి నెడఁబాసెఁ బ్రాణహా । నియు నొనర్చె
జనుల వంచించి విత్తంబు । సంగ్రహించె
భార్యఁ బీడించె వేశ్యకుఁ । బ్రాపొసంగె
ననుభవింపక తప్పునే । యాయఘంబు.

మ. దురవస్థం దలపెట్టి యిప్పుడు మదిన్ । దుఃఖించినన్ జెల్లునే?
స్థిరుఁడై యార్యులవాక్కులన్ వినెనె? బు । ద్ధిం గల్గి వర్తించెనే?
సిరియున్ యౌవనమున్ భుజద్వయబలో । త్సేకంబు గర్వం బన
శ్వరమే యాత్మకృతంబు వ్యర్థమగునే । "భ్రష్టస్య కావాగతిః"

క. మతిమంతుఁ డెవ్వఁ డీన
త్కృతిసారాంశము గ్రహించి । కీర్తించును వాఁ
డతిధృతిమై క్షితిలో స
ద్గతికిన్ గుఱియై మెలంగు । గౌరవ మొందున్.

మ. ఘనభావార్థపదప్రయోగసరణిన్ । గ్రంథంబులన్ వ్రాసినన్
వినివిద్వాంసులు సంతసింతురనుచు । "వ్విద్వత్సుదారిద్ర్యతా"
యను న్యాయ్యంబటులుండఁగా "సుకవితా । యద్యస్తి రాజ్యేనకిం"
మ్మను నార్యోక్తిఁ దలంచి వ్రాసితి నుపా । ఖ్యానంబనూనంబుగన్.

మ. ధనకాంతాకుచమండలంబునకుఁజి త్తంబిచ్చి విత్తంబుయౌ
వనముం బాసి విరక్తిఁ జెందితుదకు న్ "వైరాగ్యమేవాభయం"
బని వర్తించి జనాళికిన్ హితము సౌహార్దంబునం దెల్ప నా
తనికి న్మెచ్చులొ నొసంగితిని యే తద్గ్రంథకర్తృత్వముల్.

— ఆశ్వాసాంతము —

క. నయవినయసుగుణధుర్యా
భయదాసురధైర్యకార్య భంజనచర్యా
జయలక్ష్మీప్రియకాంతా
నయనీకృతపుష్పవంత నతహనుమంతా.

— మంగళమహాశ్రీవృత్తము —

చిత్తజవిరోధివిధి జిష్ణుసురసన్నుత విశేషగుణరత్నగణపేటీ
మత్తరిపుదైత్యగజమారణకళాకలితమంజులయశస్తురగధాటీ
కృత్తశివచాపరవ కృష్ణకృశకర్ణయుగ కృచ్ఛ్రియుతభార్గవ
జయశ్రీ, చిత్తనువిలాసముని సేవితపదాంబుజ! విశిష్టజనమం
గళమహాశ్రీ.

గద్య: ఇది శ్రీరామచంద్ర కరుణాకటాక్షప్రసాదిత సత్కవిత
లతాప్రసూనాయమానంబై నవీనప్రబంధంబయిన హేమ
సుందరోపాఖ్యానంబు నందుఁ జరమోదంతం బను
తృతీయాశ్వాసమునందు సర్వంబు
సంపూర్ణము.
శ్రీరామార్పణమస్తు.

